# శ్రీ గిరిజా కళ్యాణము

[మంజరీ ద్విపద గీతములు]

53
3-86

కవికులగురువు
మహాకవి కాళిదాస కృతియైన
కుమార సంభవము
ననుసరించి
వ్రాయబడిన మంజరీ ద్విపద గీతములు

Acc. No. 27349

కూర్పు :
పి. దుర్గారావు, యం.ఓ.యల్.

అక్షయనామ సంవత్సరము
వసంతము - వైశాఖము.

1986-మే.

సర్వహక్కులు రచయితవి.

ప్రథమ ముద్రణము - 500

మూల్యము : రు. 10-00

ముఖచిత్రం : పాతూరి కృష్ణారావు, (B.Sc.) నల్లగొండ.

ముద్రణము : "వెంకటరత్నా" విజయవాడ.

---

ప్రతులకు :—

పి. దుర్గారావు, యం.ఓ.యల్.
చెరుకుపల్లి పోస్టు,
కేతేపల్లి మండలము (వయా నక్రేకల్)
నల్గొండ జిల్లా.

# వినయ వాక్యము

కవికుల గురువైన కాళిదాస కవి
రచియించి నట్టి యా రమణీయమైన!
నవరస భక్తి "కుమారసంభవ" మనెడి
కడు రమ్య కావ్యంబు గమనియమైన!
మల్లినాథుని వ్యాఖ్య మహిమాన్వితంబు
నొప్పు మహోత్కృతి నొరగా నాను!
పలుకుల భావాల బరగ గూర్చుచును
సప్త సర్గంబులు సరిగమల్ రీతి
పాటగా బాడితి బంగారు బాట!

అజ్ఞానుడను నేను నత్యంత జడుడ
మాటలు రానట్టి మ్రానట్టి వాడ!
సంస్కృతాంధ్రంబులు చక్కగా రాని
సంస్కార రహితుడ సాధు మార్గముల!
భువికీర్తి నొందిన పూర్ణమైనట్టి
కాళిదాసుని మహా కల్పంబు నను!
స్పృశియింప దలచితి చిత్రంబు గాద!
ప్రాముగా దలచితి వన్నెలను జిందగ!
అతి సాహసంబున కలరిన నన్ను
క్షమియింపగా మిమ్ము సన్నుతి జేతు!
కవుల బండితులను గరములు మోడ్చి
అంజలి ఘటియింతు నలరు మల్లియల!
తప్పొప్పులున్నవి తగ బహుళముగ
మన్నింప వేడెద మహిమాన్వితులను

దోసముల్ జూచుచు దూషించవలదు
పాండిత్యమును జూడ బహునేర్పు కూర్పు!
జూడగా వ్రాసిన చోద్యంబు గాదు!
జిలిబిలి బల్కుల జివ్హారి నుడుల!
భక్తి భావముతోడ భవ్యబర చేయు!
ఆలోక కళ్యాణి యా శివరాణి!
ప్రేమ గాథను వ్రాయ ప్రీతి గొల్పగను!
వ్రాసితి నీ రీతి పన్నెలు జెంద!

ఆ పరంజ్యోతికి యంజలులతోడ
నతని గాథను నిదే! యర్పితంబనుచు!
నర్పించుచున్నాడ యాశలు లేక
మంగళంబులతోడ మాధవ యనుచు!

కవికుల గురువైన కాళిదాసకవి
స్మరియించుచున్నాడ సన్నుతివిహార!
నన్నయాది కవుల నవకవి వరుల
భక్తిని బూజింతు భావనజేసి!

ఏ మహనీయులు నీ కథ వ్రాసి
తిరియించినారో యా ధన్యులందఱిని!
పదముల మతితోడ సాష్టాంగములను!
నర్పింతు! బూజింతు! సంధాల పూల!

# శ్రీ గిరిజా కళ్యాణము

## ప్రథమాశ్వాసము

### (పార్వతీదేవి జన్మవృత్తాంతము)

అన్నపూర్ణకు నద్ది యఖిల సస్యముల
పలరు బంగరు భూమి యీ భారతమున!
ఉత్తరంబందున యున్నతంబయిన
యుత్తమౌషధముల కునికి పట్టయిన!
హిమ పర్వతం బన యిలను పేరొందు
యిమ్మహీధరముల కింద్రుడై వెలసె!
పూర్వ పశ్చిమముల పొంగు సంద్రముల
బొలుపుగా జొచ్చుక బొడిచిన రీతి!
మహిని గొల్చెడి యట్టి మానదండముగ
మహిమాన్వితుండుగా మన్నన వడసె!
కొండలు హిమవంతు గూర్మితో నపుడు
గోరూప ధరణికి గూర్చి వత్సముగ!
మేలు పర్వతములు మేపు గొల్లవిగ
మేలిమి రత్నాలు మేటి యోషధుల!
పృథువు జెప్పినరీతి పిదికించి రపుడు!
పొగడగా వశమె యీ పొలుపొందు గిరిని!

సకల సద్గుణముల నాకరంతునకు
నొక్క దోషంబున్న లెక్క వెట్టుదురె?
పదునాఱు కళలను జలజారి జంద్రునికి
గలిగిన మచ్చను గాంచి యెన్నుదురె?
రత్నౌషధశోభ రాజిల్లు గిరికి
మంచొక్క దోసమా మహిమాన్వితునకు?

హిమగిరి శిఖరాన యింపుల నొలుకు
సిందూర ద్రవ్యముల్ చిందదె యాకసము!
సంధ్యా లకాలంబు జయ్యన జూప
ప్రియు సమాగమువేళ ప్రీతి నాయెనని!
కిన్నెర కాంతలు కిన్నెల సారి
దొట్రుబాటున నగల్ దొఱగి మార్చుచును!
ఆరాటమున జెంది యెరుదు రెవడు
కీర్తింపగం మె యీ గిరిరాజు కీర్తి?

ఉన్నతుండైన యీ యద్రీశ్వరునకు
మన్యగా దారాడు మహిత మేఘములు!
చల్లని చరియల జలదాల క్రింద
సిద్ధులు నివసింత్రు సిద్ధ తపంబులను!
శార్దూలముల్ వడిరాగ వెడలి యీ చరియ
లెటుల కాంతులు గం యాంబరోధి!
గిరి శృంగముల జేరి కీర్తింత్రు హరుని
జపముల దపముల జరియింతు రిచట!

గజములు సింహముల్ గలవు నా కొండ
నానామృగంబుల నాభి యీ గిరులు!
గజముల కుంభాలు గడ వేర్చి జేరి
హరుల గోళ్లను రాలు సరు ముత్యములు!
దారుల బోదురు దండింప హరుల
వేటాడు బోయలు విరివిగా గలరు!

విద్యాధరుల కదె వేడుకౌ భూమి
దివిజ కాంతలు దాని దివిగ భావింత్రు!

పొలుపారు నెత్తావి భూర్జపత్రముల
సింధూర ద్రవ్యాల జిత్రాక్షరముల!
విద్యాధరాంగనల్ వేడ్క మీర
బ్రియులకు పంపింత్రు బ్రేమ లేఖలను?
వర్ణింప గలుగునా వాగీశ్వరుండు?
కీర్తింప దరమె యీ గిరిరాజు మహిమ?

ఎత్తయిన యీ గిరి నింపొందు గుహలు
మధుర గీతములచే మార్మ్రోగుచుండు!
కిన్నర సతులట కిన్నరల్ మీటి
గాంధార రాగముల్ కలిసి పాడుదురు!
కీచక రంధ్రముల్ వీచు గాలులను
సరిగమ పదనిస సవ్యాసల్ రాగ
హిమవంతుడును గూడ నమల కంఠమున
శ్రుతిగల్పినట్లుండు సుందర ధ్వని!

చెక్కిళ్ళ గండూతి చెడ్డరి పోవుటకు
దేవదారుల చెంత ద్విపములు జేరి!
రాపిడి సలుపగా రయమున జెట్ల
కొమ్మల రెమ్మలు, జిమ్మనా పాలు!
మధుర సువాసన మాధుర్యములను
దరియలన్నియు నిండి విరియుచునుండు!

సుందరంబయిన యీ సురుచిరంబైన
ఎత్తయిన యీకొండ నింపొందు గుహల!
వనముల జరియింత్రు వన కిరాతినులు
పతులతో గ్రీడింత్రు సాంద్ర సౌఖ్యముల!

ఓషధుల కాంతులే యొసఁగ దీపములు
సురత సౌఖ్యములను దేలుచు న్నారు!
తృణజ్యోతి కాంతులే తేజస్సులగును
గజదంత కాంతుల ప్రకాశించు చుండు

గడ్డకట్టినమంచు కఠిన మార్గముల
నడుచు పెట్టరాని యతి పల్లజనము!
కాలి వ్రేళులు మడమ గలచిన మంచు
బాధ సహింపంగ వలతురు గాని!
ఉరు పయోధరములు, సున్నత శ్రోణి
బరువు భారములను భరియింప లేరు!
కిన్నర సతులట సన్నంపు నడక
మందగమనము వీడ మదినోర్వ లేరు!

పగటికి భయపడి పరుగున వచ్చి
శరణన్న చీకటిని జయ్యన బ్రోచి!
గుహాలందు నివసింప గూర్మి తోడ తను
నాశ్రయం బిచ్చిన యచల భావకుడు!
ఉన్నతులైన వారుర్విలో జూడ
క్షుద్రులైనను వేడ నార్ద్రచిత్తమున!
సజ్జనులకు బోలె సంరక్ష జేసి
కరుణ బ్రోతురుగదా! కమనీయ గతుల!

చమరీ మృగంబులట నయ్యాట లాడు!
నటునిటు గదలించి యల్లార్చుకొనుచు!
చంద్రకాంతుల బోలు సందాలు జిందు
వాలముల్ వింజామరలు పట్టు దోచు!

గిరిరాజు శబ్దంబు సార్థకము సేయ
వింజామరలు నెట్లు విసరుచున్న వోకో!

ఆకాశమును నంటు నా పర్వతమున
కింపురుషాదులు క్రీడింతు రచట!
గిరిగహ్వరంబున క్రీడించు సఖులు
సఖియుల జీరెలం జయ్యన లాగ!
కింపురుషాంగనల్ కిటికిను జూప
లజ్జ బాపగా లాలిత్య మలరె!
గుహాద్వారములయందు గాఢంబుగాగ
తెరలుగా మేఘాలు తేలుచునుండు!

ఆ మహా నగమున యా కిరాతకులు
వేటాడ మృగముల వెదకుచు నలసి!
తూగి గంగానదీ తుంపురు లంది
సరళ వృక్షంబుల సామీప్య మొంది!
బర్హి పింఛంబుల బడి శుష్కమాగు
మంద మందములైన మధుర వాయువుల
సేవించుచుందురు చింతలం బాయ
శ్రమ దీర్చుకొందురు సఖియుల గూడి!

ఆ పర్వతాగ్రముం దా సరస్సులను
దామరల్ వికసించు దరుగని కాంతి!
సప్తర్షి గణము దా స్వయముగా ద్రుంచి
పూజకై గొందురు బొలుపు దామరల!
క్రిందుగా జరియించు జందురు నన్న!
మిగులు పుష్పంబుల మిలమిల జూచు!

ఊర్ధ్వ కాంతులచేత నోరజూపులను
వికసింప జేయుగా వేల దామరల !

ఆ హిమగిరియందు ననమానమైన
శోభిత ధాములు విమలౌషధములు !
యజ్ఞాంగ యోనిత్వ యశము బరికించి
భూధరణంబును భూరిశక్తియును !
బ్రహ్మ దా నేరుగా సమ్మతి మెచ్చి
యజ్ఞ భాగముతోడ నెనలేని కృపను !
శైలాధిపత్యంబు జక్కగా నిచ్చి
పెద్దగా జేసెను జేర్మి హిమవంతు !

బంగారు కొండకు బరమ మిత్రుండు
మర్యాద నెఱిగిన మాననీయుండు !
హిమవంతు డప్పుడు నెనలేని ప్రేమ
పితృదేవతలకు ప్రియమైన పుత్రి !
మునులకు సైతంబు మోదమౌ బిడ్డ
ఆత్మానురూపయౌ నారు మేనకను !
వంశ గౌరవమును నర్థిల్ల జేయ !
వేదోక్త పద్ధతి విధి బెండ్లి యాడె !

కొంత కాలంబునకు గోర్కె లీడేర
నా పుణ్య దంపతు లా సతీ పతులు !
చక్కని దనమున సరస స్నేహతకు
దాంపత్య విధులను ధర్మంబు నడుప !
నవయౌవనాంగియౌ నాతి మేనకకు
గర్భ మాయెను చంద్ర కాంతులు వెలయ !

నాగకన్యల ప్రేమ రాగంబు లందు
వారితో సఖ్యము వర్ధిల్లు వాని !
కోపగించినగూడ గూర్మి దేవేంద్రు
కులిశంపు దెబ్బలు గురికాని వాని !
మగువ భూధరపతి మైనాకు గనియె
మంద గాలులు వీచె మహిబుల్కరించె!

గత జన్మలో దక్షు గూతుగా బుట్టి !
భవునికి భార్యయై భాసిల్లి సతిగ !
తండ్రి నిందం జేత దల్లడ పంది
వేగ యోగము చేత విడిచి దేహమును !
మరల జన్మింపగా మహితాత్మ గౌరి
భూధరపతి వంత బొందుగా నందె !

ఉత్తమ సంతాన మొంద గోరుచును
భూధర సతిజేసె బుణ్య కార్యములు !
హిమవంతుడును గూడ నింపుగా సతికి
బాసటగా నుండె బరను కార్యముల !
వ్రతములు, నోములు నొప్పుగా జేసి
కళ్యాణి గౌరిని గనిరి బుత్రికగా !
నీతియుం దుత్సాహ రీతి వర్ధిల్లు
సంపదవలె బుట్టె సభయ వారలకు !

ఆ మేనకాదేవి యా మహీధరుల
కా పార్వతీదేవి యవతరింపగను !
దిశలన్ని సౌందర్య తేజంబు వెలిగె
మంద గాలులు వీచె మహి బుల్కరించె!

శంఖధ్వనులు మ్రోగె శ్రవణపేయముగ
పూల వానలు గురిసె పుడమి సంతటను !
స్థావర జంగము సకల జీవులును !
సంతతానందముల్ సౌఖ్యము లందె !

దూర పర్వత భూమి దుర్గంబు లందు
తొలికారు మేఘాలు దూగాడు చుండ !
ఉఱుముల సవ్వడిప యుదయించి నట్టి
రత్న శలాకచే రాజిల్లు నట్లు !
కాంతి మంతంబుచే గమనీయ మయిన
చిన్నారి పార్వతి వన్నెల జిందె !
తల్లి మేనకు బొందె దరగని కాంతి
పద్మంబు వికసించు బద్మాకరముగ!

పరమ కళ్యాణి యా పరమేశు రాణి !
పర్వతేశ్వరునకు ప్రభవ మొందగను !
అభిజను లందఱు నానంద మొంది
'పార్వతి' యని బిల్చి పరవశంబైరి !
"ఈ మహో దపమును నీ గాఢ దీక్ష !
ఓ బాల ! మానుము ! నోర్వ లేవనుచు !"
తల్లి బల్కుట జేసి దరుణి యాదేవి !
'ఉమ' యంచు పేరొందె నొప్పగా ధరణి !
ఘన కార్యములు జేయ గలుగదా కీర్తి ?
ఘనులు జేతురు ఘన కార్యముల్ భువిని!

అందాల కళలతో నా చందమామ
ప్రతిదిన మభివృద్ధి భాసించు పగిది !

ఆ బాల పార్వతి యలరుచు కళల
పరిపూర్ణ మానవైయె బలగుచునుండె !
కమనీయ జ్యోత్స్నల కళలొప్పునట్లు
లలిత పార్వతి యందు లావణ్య మొప్పె !

ఆ హిమవంతున కా భూధరునకు
కొమరులు గొమరితల్ కొల్లగా నున్న !
పార్వతి యందుండు బంచ ప్రాణములు
అల్లారు ముద్దుగా నతి గారవించు !
మధువులు వొలికే మధు వసంతమున
ఎన్ని పూవుల తీగ లెన్నున్న దరులు !
తుమ్మెద బంక్తులకు దొరంపు బ్రేమ !
మావి కొమ్మలపైని మమత హెచ్చుగద !

ఆ శైల నాథుండు నా మహీధరుడు
పరమ కల్యాణి యా పార్వతిచేత !
దిశలు కాంతులు దొల్క దీపంబు రీతి
గంగచే రాజిల్లు గగన మార్గముగ !
విద్యచే భాసిల్లు విద్వాంసు పోలె
పూత పవిత్రతల్ పొలుపుగా జేరె !

పార్వతీదేవి యా బాల్యంబునందు
నాటల రుచి జూచి యారుచున్నట్లు !
మందాకినీనదీ యందమౌ దరుల
నిసుక తిన్నెలయందు నిండ్లు నిర్మించు !
సఖియలతో గూడి సరస రీతిగను
బొమ్మల పెండ్లిండ్లు నిమ్ముగా జేయు !

తోడిబాలికలతో నాడు బంతులను!
మాటిమాటికి నాడి మది బుల్కరించు!

పార్వతీదేవి యా బాల్యంబునందు
నుపదేశికుల యొద్ద నొప్పుగా జదివె!
కమనీయమగు శరత్కాలంబునందు!
నలరి గంగను జేరు హంసమాలగను!
దివ్యౌషధి తన దీధితుల్ వెలిగి
రాత్రివేళను వచ్చి రాజిల్లునట్లు!
గతజన్మ నేర్చిన ఘన విద్యలన్ని
యుపదేశ మాత్రము నొప్పుగా వచ్చె!

ఆ పార్వతీదేవి యత్యద్భుతముగ
పూమొగ్గ వికసించి పుష్పమైనట్లు!
శశిరేఖ పెరిగి చంద్రబింబముగ
సన్నని దేహంబు వన్నెలం జెందె!
ఆసవంబునుగాని యుత్సాహగుణము
మదనుని బాణమై మదికింపు గొలుపు!
బాల్యంబుకంటెను బలమైన వయసు
నా బాలలో జేరె నలరు యౌవనము!

రంగుల కుంచెతో రమణీయమైన
చిత్రకారుడు దీర్చు చిత్రంబు భంగి!
రవికాంతి ప్రభచే రాజిల్లునట్టి
శతపత్ర సుందరి సౌభాగ్య గరిమ!
నవయౌవనము రాగ నగరాజ పుత్రి!
చతురస్ర శోభియై చాన దీపించె!

ఆ జగదీశ్వరి యా లోకమాత !
తరుణ యౌవనమున దగ బ్రవేశింప !
ఆ పార్వతీదేవి యలరు పాదములు
భూమిపై నిడ నతి పొలుపుల జిందు !
ఒకచోట నిలువక యొప్పులగులుకు !
మెట్ట దామరపూల మెఱుగుల జూపు !
అంగుష్ఠ నఖములు నరుణకాంతులను
గ్రక్కు నట్లుండును గమనీయ గతుల !

ప్రత్యుపదేశంబు బరగ గాంక్షించి
హంసలు నేరిచి యందాల నడక !
ఆ పార్వతీదేవి యందెల రవళి
ననుకరింపంగ దమ యాశయో యేమొ !
లీలా విచేష్టిత లలిత పాద గతి
హంసలు నేర్వనా యున్నట్టు లుండు !
లోక ప్రసిద్ధంబు 'విద్యయా విద్య'
ఒక విద్య నేర్పి దా నొక విద్య గొనుట!

అపురూప సుందరి ! యఖిల కల్యాణి !
యాపార్వతీదేవి నజుడు సృష్టింప !
తన నేర్పునంతయు దగ వినియోగించి
ముందుగా జంఘల నందాలు గూర్చె !
పొంకపు కదలికలుగాక పొలుపుల నొలుకు
ఆదోకపలె నుండి యందాలు జిందు !
శేషాంగముల నెల్ల జేర్ప ముందుగను
అజుడు దా యత్నంబు సలిపెనట్లుండు !

నాగేంద్ర హస్తంబు నయగారములను
రాజ రంభాదుల రమణీయతను !
సజ్జన హృదయాల సరసత మెఱయు !
సూర్యాంతో బోల్చి నగ్గింత్రు గవులు !
కవిచక్రవర్తి శ్రీ కాళిదాస కవి
అఖిల లోకేశ్వరి యా హైమవతిని !
సౌందర్య హృదయాన సరసతి బొగడి
యుపమాన రహితము సూర్యాలకనియో !

పరమ కల్యాణి యా పార్వతీదేవి
కాంచీగుణస్థాన కమనీయతలను !
కీర్తింపదరమె యా కిన్నెరలకును
నందుకే గిరిసుత కా భాగ్య మబ్బె !
ఎన్ని పూజలు నోము లెన్ని జేసినను
నే పతి బొందని యీశ్వరు నంక !
మా గిరి సుతబొందె యెట్టి భాగ్యంబొ !
దపసుచే బరమేశు దగ బతినొందె!

ఆ పార్వతీదేవి యలరు మేఖంను
వర్ణింపదరమా యా వాచస్పతికిని !
పోకముడి నటుదాటి పొలుపుల జిందు
నాభి ప్రవేశించు నవరోమ రాజి !
మేఖలా మధ్యంబు మెఱుపుల జిందు
యా నీలమణికాంతి యందాల నొలుకు !

నవయౌవనము పోక నగరాజ పుత్రి
నవ్య సౌందర్యంబు నవశోభలందె !

యజ్ఞవేదిక వోలె విన్ననై యున్న
ఆ పార్వతీదేవి కలరె నెన్నడును!
కటిదేశ మందున కమనీయ గతుల
వళిత్రయ మొప్పెను వయ్యారముగను!
నవయౌవనముజేయు నవసృష్టి యేమొ
కాము నాహ్వానింప గట్టిన మెట్లొ!

నవయౌవనముజేర నాతి పార్వతికి
అన్యోన్య పీడన ములరె స్తన ద్వయము!
పాండుర వర్ణంబు బఱగి చెంపొంది
నల్లగల్వల కన్న లమరె శోభలను!
వామాక్షి నింపొందు వక్షోరుహముల
దామరతూటి దారము బోందదాయె!

సుకుమారములునైన సుదతి బాహువులు
దిరిసెన బువ్వుల మురిపముల్ జిందు!
ఔరౌర! మదనుడా! యాశ్చర్య మొదవు
ముందుజూపున కెంతొ మోదంబు గలుగు!
ఓసి నే హరు జేత బూడిద నౌదు!
నైన నే సాధింతు! హరునంచు మదిని!
పంతాన గిరిసుత బాహువు లట్లు
హరు కంఠపాశమో యనగ జేసితివా!

స్తనములన్ రాజిల్లు దనరు కంఠమును
ముత్యాల హారము ముదమున గూడ!
అన్యోన్యాలంకార మతిశయంబుగను
గన్నుల బండువు గావించు చుండు!

హార మా కంఠము నందాల గూర్చె
కంఠమా హారమున్ గలిగించు శోభ!

కాంతి సుగంధముల్ కాంక్షించు లక్ష్మి
చంద్ర బద్మంబుల చందంబు గాంచె!
చంద్రునిలో జేరి యందంబు జూచె
పద్మ సుగంధంబు భాసింపదాయె!
పద్మములో జేరి పరికింప లక్ష్మి
చంద్ర జ్యోత్స్నల హాయి పొందకోదాయె!
మరిపాన గిరికన్య ముఖము మాశ్రయించి
చంద్ర పద్మంబులు సుందరం బందె!

ఆ పార్వతీదేవి యధరోష్ఠ మందు
జిందేటి చిఱునవ్వు చిత్రింప వశమె ?
చిగురు పై నుంచిన తెల్ల తామరను
నందాల పెట్టివో చంద మట్లుండు!
కెంపు పై ముత్తెంబు నింపుగా నుంచ
సుందరం బెట్టిదో యంద మట్లుండు!

పార్వతీ దేవి శ్రీ పరమ కళ్యాణి!
మధుర భాషణముల మధురిమల్ జిందు!
మంజుల స్వరమున మాటాడు నపుడు
తీపి దనంబునం దేనెల్లు దొలుకు!
అన్యబష్టంబుల సురిరాగములు
విపంచి తంత్రుల వోలె వినిపించుచుండు!

కమ్మని గాలుల గదలాడు పట్టి
నల్ల గల్వాల బోలు నలినాక్షి కనులు!

చంచల మగుజూపు చాగు నేత్రములు!
బోసగన వచ్చెరుగ్ బొందు లోమదిని!
హరిణ కాంతల నుండి నందెనో యేమొ!
హరిణ కాంతలె నామె ననుకరించినవో!
అనిపించు వీక్షింప నా బాల కనులు!
ఈ చూపు చక్కదన మొందైన గలదె?

సుదతి కనుబొమ్మలు జూడ చక్కనివి
కాటుక బుంకను నీటుగా దిద్ది!
ప్రాకుగా బడె నేమొ వనిత భ్రూలతలు!
నాజూకు రేఖలై యుండాలు జిగురు!
కాంతులు వీక్షించి కవలి మన్మథుడు
తనవింటి గర్వమ్ము డిగ విడిగ్గించి
తన పూల బాణముల్ దనవింటి నుంచె!
వనిపించు గను బొమ్మ లందాల జూడ!

ఆ పార్వతీదేవి యుండాలు జిడుము
కేశపాశము జూచి గింక నహించు!
చమరీ మృగంబులు సరస వాలములు
వింజామరను లట్లు విసరుట మాని!
సిగ్గు లజ్జ వున్న శ్రీఘ్రమే యొరులు
వాల ప్రియత్వమున వెలయు గర్వంబు!

వేయి మాటలవేల వేయి గాథలును?
ఆ పార్వతీ దేవి యంద చందములు!
విశ్వ సౌందర్యంబు విపుల సుందరత
ఒక చోట జూపగా యోచించి ధాత!

సర్వోత్తమ ద్రవ్య సారముం గూర్చి
సృష్టించెనా యన చిత్తముం దోచు!
కాకున్న యాబాల కమనీయ సృష్టి
రూపు వహించునా రూఢి నీ జగతి?

సకల లోకంబుల సంచరించుచును
నొకనాడు నారదుం డొప్పుగా వచ్చి!
హిమవంతు దీవించి యింపుగం గులుకు
పార్వతి గని మాని పరగ నిట్లనియె!
ఈ బాల పొందగల దీశుని బతిగ!
హరుని శరీరార్థ మందు లేగాక!
సవతులు లేనట్టి సఖియ యీ జగతి
సర్వేశ్వరుని బొందు సార్థకంబుగను!
అందుకే గిరినాథు డాత్మ సంతృప్తి
పూర్ణ యౌవనవతి పుత్రికై తాను!
అన్యుని వెదుకంగ నాసక్తి మాని
నిశ్చింత నుండెను నిర్మల బుద్ధి!
మంత్ర పూతంబైన మహిత హవ్యంబు
అగ్నిని బొందగా నర్హమా గాని
ఇతర తేజస్సుల నింపుగా బొంద
నర్హమా వస్తువా? యాహుతి నొంద!

ఆ హిమవంతుడు నా మహీధరుడు
నడుగని బరమేశు నర్చించి వేగ!
తన కూతు పార్వతి దగ స్వీకరింప
జేయు జాలకపోయె చిరసత్యమేగ!

అభ్యర్థనా భంగ మగునేమొ యనుచు
నిష్టకార్యము గూడ నిది మనిం దలచి!
మాధ్యస్థ రూపంబు మౌనభావమున
మాటాడకుందురు మహితాత్ము లెపుడు!

సుకుమారి సుందరి సుదతి యాగిరిజ
గత జన్మలో తన సతిగ జెల్వొంది!
దక్షుని రోషాన దసరి యోగాగ్ని
దేహంబు విడిచెనో దివ్య మార్గమున
ఆనాటి నుండియు నా మహాశివుడు
ముక్త సంగుండాయె ముని వృత్తినుండె!
అపరిగ్రహుండుగా నా మహామహుడు
ఆత్మ చింతనమున నలరె యోగమున!

ఆ కృత్తివాసుండు నా త్రిలోచనుడు
నియతాత్మ చిత్తుడై నిర్మలబుద్ధి!
గంగా ప్రవాహంబు గదలాడు చోట
దేవదారుల తోడ దీపించు స్థలిని!
కస్తూరి వాసనల్ గప్పెడి తావు
కిన్నర గానముల్ జెన్నుగా జెలగు
ఉన్నత హిమగిరి నొకరమ్య చరియ
దపము జేయగ బూనె దన్మయత్వమున!

ఆ పరమేశ్వరుం డటు దపము సేయ
సురపొన్న బూవుల శిరమున దాల్చి!
భుజపత్రి వస్త్రముల్ పొందుగా గట్టి
మణి శిల బూతల మసలు ప్రమథులును!

ఈశాని ప్రదేశముల రమణీయ గతుల
యాత్రికులై యందు రా యీశు జెంత!

గడ్డకట్టిన మంచు శిఖరా రాల
గౌరిశం ప్రవృద్ధము విరియ సౌభాగ్యము!
అనన్త కా మధురము నాపించు మని!
సమయ మృగంబులు గన్నెత్తి జూడ!
ఆ శివ వాహనం బా వృషభంబు
సింహ నాదము వోలె చిద్విలాసముగ
రంకె వేసెను నద్ది రవళులు జిందంగ!
కొండంత మార్మ్రోగ కోటి బ్రహ్ముల!

తపసు దానే యగు దనరు ఫలంబు
ఇంద్రదత్వ ఫలమును నిండుగా దానె!
స్థితి లయంబులు దానె సృజన కర్తయును
ఆ పరమేశ్వరుండా పరంజ్యోతి!
తన యష్టమూర్తుల దానె యా నగ్ని
సమిధుల నగ్నుల స్వాహా స్వరము!
తగ ప్రతిష్ఠించుకుని తపము దా జేసె!
తనయందె తగ దానె తన్మయం బగుచు!
ఎద్దియో కోరిక నెఱుగ రెవ్వరును!
నా తప మా ఫల మతనికే యెఱుక!

ఆ హిమవంతుడు నా మహీధరుడు!
అఖిల లోకేశ్వరు నా సాంబశివుని!
అంఘ్రి పద్మంబుల చేరి పూజించి
శుశ్రూష గావించనై సుతను నర్పించె!

సఖులతో గూడిన సరసాబ్జ ముఖిని
తన తనూజాతను దగ నియోగించె!

ఆ పరమేశ్వరుం డా పరంజ్యోతి
యోగిరి కన్యక నా కల్వ గంటి!
తన యోగ దపముల దగు విఘ్నమైన
తరుణి సేవలకును దగ సమ్మతించె!
మహాపు వంచు తకు మార్గంబు లున్న
మనసును నిరోధించి మహిమాన్వితముగ!
నిలుచు వాడే గదా! నిజమైన ధీరు
డనిపించు కొనగదా నవనిపై నతడు!

ఆ త్రిలోచనునకు నా శైల తనయ!
పూజకై కుసుమాలు పొందుగా దెచ్చు!
నియమాన వేదిక నూడ్చు నీరముల్ దెచ్చు!
దర్భలు, పత్రముల్ దగ దెచ్చి యిచ్చు!
ప్రతిదిన మీ రీతి బరగ శుశ్రూష
పరమేశునకు జేయు పార్వతీదేవి!
ఆ పరమేశునకు నా రీతి జేసి
శుశ్రూష నేసిన సుదతి పార్వతికి!
సన్నని కిరణాల వెన్నెలల్ బఱపి
బాలచంద్రుడు వీమ బడలికల్ దీర!

ప్రథమాశ్వాసము సమాప్తము

# శ్రీ గిరిజా కళ్యాణము

## (ద్వితీయాశ్వాసము)

### (తారకాసురుని క్రూరకృత్యములు, దేవతల బాధలు)

ఆ పరమేశున కా శైల తనయ
శుశ్రూష జేసెడి శుభసమయమున!
తారకుం డను నొక దానవేశ్వరుడు
నజుని వరంబున నఖిల లోకముల!
బాధింప దొడగెను బలు విధంబులను
దేవత లందఱు దిక్కేది యనుచు!
ఇంద్రుని తోడుత నెల్ల దేవతలు
బ్రహ్మలోకము జని ప్రార్థించి రపుడు!

సుప్త పద్మంబుల శోభిల్లు రాత్రి
భాను దర్శనమున ప్రభవిల్లు నటుల!
దీప్తుల దగ్గిన దివిజుల కపుడు
ధాత ప్రత్యక్షమున దగ ధన్యులైరి!

సర్వ లోకములకు సకల విద్యలకు
దా సృష్టికర్తయు దా గురుండైన!
నాలు మోములు గల నలువకు మ్రొక్కి
భక్తితో ప్రార్థన బలికి రా సురలు!

సృష్ట్యాది నొకడవై చోద్యమై యుండి
సత్త్వాది గుణముల సరసత గూర్చి!
మూర్తి త్రయంబును మోదము నంది
యులరు స్వామివి నీవు! యంజలి గొనుము!

నీళ్ళలో నుంచిన నీ బీజ మహిమను
సకల చరాచర సంఘంబు పొడమె!
నిఖిల విశ్వంబున కీవె కారణము
నీ చిత్ర రచనకు నీరాజనములు!

సృష్టికి బూర్వమునొక్కరై యుండి
మూడవస్థల నంది మూడు మూర్తులను!
సృష్టి సంహారంబు స్థితికి హేతువుగ
నేరు నీ కివె గొను! నభివందనములు!

స్త్రీ పురుష రూపముల్ చిత్రింప దలచి
ఆత్మరూపము రెండు మూర్తులం జేయు!
ఆ మూర్తులే గదా యఖిల సృష్టికిని
తల్లిదండ్రు లటంచు దగ జెప్ప బడియె!

నీదు కాల విభాగ నియమము నందె
నీ రాత్రి బవళులు నిఖిల జీవులకు!
ప్రళయోదయంబులు బ్రకృతి కంతటికి
సంహార సృష్టులై సరసత బఱగు!

ఈ విశ్వ సృష్టికి యీవె కారణము!
నీవె లయకర్తవు నీ వాదిమూర్తి!
జగదీశుడవు నీవె జాగృతి వీవె!
నీవు లేనిది లేదు నిఖిలంబు నీవె!

నీ చేతనే నీవు నిను దెలిసి కొనుచు
నిన్నె నీవే సృష్టి నిర్మించు కొనుచు!
నీవు లయ మౌదువు నీలోనె నీవు!
నీవు స్వతంత్రుడవు! నీ వధికారి!

ద్రవ కఠినము లీవె! నీవె సర్వంబు
స్థూల సూక్ష్మము లీవె! సురుచిరం బీవ!
లఘు గురువులు నీవె! లావణ్య మీవె!
కార్య కారణ మీవె! కల్యాణ మీవె!
అణిమాదులును నీవె! యంబర మీవె!
నీవు లేనిది లేదు నిఖిలంబు నీవె!

హెచ్చు తగ్గు స్వరంబు లింపొందు మొదల
ఓంకార శబ్దంబు యొనరు వాక్యముల!
కర్మయజ్ఞం బౌచు గ్రాలుచునుండు!
ఫలము స్వర్గంబునై బాసిల్లు చుండు!
అట్టి వేదములకు నధిపతి వీవు!
నీవు లేనిది లేదు నిఖిలంబు నీవె!

సత్వ రజస్తమో సంఘమౌ బురుషు
భోగ మోక్షము లిచ్చు మూల ప్రకృతివి!
నీవ యుండెదరు మఱి నిఖిల లోకములు
గాంచుచుండెడి యాత్మగా నెంచుచుంద్రు!
పితృ దేవతలకు పితరుండ వీవు!
దేవతలకు మఱి దేవుండ వీవు!
పరమున కంటెను బరమైన వాడ!
బ్రహ్మల సృజియించు బరమాత్మ వీవు!
శాశ్వతుండవు నేవు సర్వంబు నీవు
హవ్యంబు! హోతవు! వంటయు నీవు!
భోజ్యవస్తువు నీవె! భువి యంత నీవె!
వేద్య వేదితముల విశదమౌ వాడ!

ధ్యానించు వాడవు! ధ్యానింప దగిన
దంతయు నీవె సూ! సకలంబు నీవె!

ఆదేవతాసంఘ మతి భక్తి తోడ
ప్రార్థన సేయంగ బ్రణతుల వినియు!
అత్యనుగ్రహమున నా సృష్టికర్త
యీ దివౌకసులకు నాసక్తి వలికె!

ఆర్ద్రిత తోడుత నాహ్లాదముగను
నా జతుర్ముఖుడట్లు వలరి బల్కగను!
నాల్గు రీతుల భాష నాల్గు మోముల ను
వెలువడి నటులుండె వేడ్క మీర!

ఓ దివౌకసులార! ఓ బిడ్డలార!
ఆజానుబాహువు లమరవరు లార!
వీర విక్రము లార! విదిత తేజమున
సామర్థ్యమున మీరు సాధించి రిట్టి!
అధికారములచేత నలరారు మీకు
స్వాగతం బిదె! మీకు! స్వాగతం! బిదిగో!

ఓ దివౌకసులార! ఓ బిడ్డలార!
మంచుతో గప్పిన మహనీయమైన
నక్షత్రముల బోల్కి నగుపించు చుంటి
రేమి కారణ మౌనో? నేమాయె నేమొ!
తొల్లింటి దేజంబు జూడరా దేమి?
కమనీయమైన యా కాంతు లెట్టు వోయెనో?

కాంతుల జిందెడి కమనీయ మైన
ఇంద్రుని యాయుధం బేల నిట్లయ్యె?

వధియించి వృత్రుని వాసి కెక్కినది
వజ్రాయుధంబునకు వన్నెలు తగ్గె!
మొక్కవోయిన యట్లు మొనవోయినట్లు
కానిపించుట గల కారణం బేమి?

వరుణుడు వటులుండె వన్నెలు తగ్గి
మోము నేలకు వ్రాలె మోహంబు వోయె!
అరులకు దుర్వారమైన యా పాశ
మతి కాంతిహీనమై యొరుట జూడ!
గరుడమంత్రంబుచే గతి కోలుపోయి
ఫణిదైన్య దీనత కనిపించు చుండె!

ఆ కుబేరుండటు సలతను కుంది
కాంతి దప్పుట గల కారణం బేమి?
భగ్న శాఖ ద్రుమము బగిదిని మున్న
యుడుగద నొదిలిన యుత్తరాధిపుని!
బాహువున్ జూడగా బాధలు మదిని
తెలుపు చున్నది పోలె దేలపడు చుండె!

యమలోకమును నేలు యమధర్మరాజు
కాంతులం దగ్గిన కాల దండమున!
సోలి గిలుట జూచి నిర్వాణమైన
కొలని దీనత్వంబు కొమరొప్ప జూపె!

ద్వాదశాదిత్యుల దశలు మారెనొకో?
ఈ చల్ల దనమేమి? యీ విధం బేమి?
ఆ తేజ మాదీప్తి యా యగ్ని శిఖలు
నే మాయెనో గదా! యెందు దాగినవో!

చిత్తరువులోనున్న చిత్రంబు బగిది
చూడగా దగియుండె! జోద్యమాయెనుగా!

ఈ మరుత్తులిదేమి? యీ తడబాటు?
గమన వేగము దగ్గి గతిని దప్పినవి!
పెనుబండ డీకొని వెనకకు మఱలు
సెలయేటి ధారల జిత్ర మాయెనుగా?

రుద్రగణంబేమి రౌద్రమున్ వీడి
జటముడి వ్రేలాడు జంద్రరేఖలను!
హుంకారములు వీడి శంకల మదిని!
నీ గతి నుండుట కేమి కారణమొ?

సామాన్య విధి నొక సవిశేషవిధిని
సంకోచ మొందిన సరళిని మీరు!
అప్రతిఘ్నులు లావైన వారు
అట్టి వారలు శత్రు లాక్రమింపగను!
ఇట్టి పరాభవం బొందిరా యేమి?
ఇట్టి వెన్నాటును గందిరా యేమి?

కొమరులారా! మీరు కోరున దేమి?
కూడివచ్చిన పని కోరిక యేమి?
లోక సృష్టియు మఱి లోక రక్షణము
నాయందు మీయందు నయముగా గందు!

అంతట వాసవుండా బృహస్పతిని
వివరింప ధాతకు వేడుక మీర!
కనుసైగ జేసెను గలత బాటునను!
కమలాకరంబుగా గనులు వేయుంట!

కన్నులు వేయింటి కన్నను మిన్న
సర్వ కార్యములందు సరసత నెపుడు!
ఆలోచనలు దెల్ప నాచార్యవరుడు!
వాసవు గనుసైగ వాచస్పతియును
ప్రాంజలి నిట్లనె బ్రహ్మతోడుతను!
వివరింప దొడగెను వేదనను సురల!

నీవు చెప్పినదంత నిక్కమే తండ్రి!
మాయధికారముల్ మూడు తేజములు!
అరివీర బలమును హరియింప బడిరొ
సర్వ సృష్టి స్థితి సంహారకుడవు!
సకలము దెలియును సాధు సంరక్ష!
ఐనను దెలిపెద వినుమయ్య కృపను!

నీ వరములచేత నిండు గర్వమున
తారకాసురుడను దానవు డిపుడు!
లోకనాశమునకు గాక జేయుచును
లోకజాక్కు బోలె దూలుచు నుండె!

తారకు భయముచే దల్లడిల్లుచును
భానుండు దీప్తుల భాసింప మానె!
తారకు పురమందు దా భయంబడుచు
బావుల కొలకుల బహు సరస్సులను
కమలముల్ వికసింప గాంతులు దగునో!
అంత మాత్రము సూర్యు డందించుచుండె!
సేవించు చంద్రుండు చిరదాస్య స్థితిని
సర్వకాలము తన కళలతో గూడి!

హరు జటాజూటమం దా శేఖ దక్క
అన్నింట బచరించు నా దైత్య వరుని!

వూ దొంగ యుంచుచు బూలదోటలను
వాయు దేవుని బిల్చి వరుస దారకుడు!
తన బ్రక్కనే నిల్చి తగ వీవనలను
వీచున ట్లీనగా వివరించి నిలిపె!

పర్యాయమున వచ్చు బద్ధతిన్ మాని
వర్యాయములు మాని సర్యాట మాని!
ఋతువులన్నియు దాము నొక్కపై వచ్చి
పుష్ప సంభారంబు బూనక సేయు!
ఉద్యాన పాలుర నొప్పుగా గూడి
సేవించు చున్నవి చేరి రక్కసుని!

ఆ సరితాంపతి యా తారకునికి
రత్నాలు ముత్యాలు రంజిల్ల నొసగి!
దయను సంపాదింప దా జూచు చుండు
వెదుకు మందును నీట వెతనంది మదిని!

మాణిక్య దీపముల్ మాన్యత నొంది
వాసుకి మున్నగు నెపగు సర్పములు!
స్థిర రాత్రి దీపముల్ తీరుగ బొంది
సేవించు చున్నవి చిరదాస్య వృత్తి!

ఆ తారకుని దయ బందగా గోరి
కల్ప వృక్షం బట గనక భూషలను!
మణులను, ముత్యాలు, మాణిక్యములను,
పట్టు వస్త్రములును భవ్య వస్తు తతి!

మాతలతో నంపి ప్రీతిపాత్రతను
అడుగుల మడుగులు నర్పించు చుండె!

ఈ విధంబున బూజ లిట్టి మర్యాద
లందుచు నిలవడు పర నిముసమును!
భువనత్రయంబును బూనిక తోడ
బాధించు చున్నాడు బలుడు రక్కసుడు!

నందన వన తరు లందముల్ మాసె
మోడులై బీడులై మొఱయుచునుండె!
ఆకాశగంగ నీ రంది పుచ్చుకొని
యమర వధూ సదయా హస్తాలచేత!
చిదిమెడి తీగలు జిన్నారి తరులు
ఛేద పాతములను ఖేద మొందినవి!

ఆ తారకుడు నిద్ర యఱరిన యప్పుడు
చెఱనున్న దేవతా చేటులు వగను!
ఘావ్న శీకరముల బ్రభవింప జేసి
సన్నని గాలుల జల్లులన్ తడిపి!
విసురుచు నుందురు వింజామరలను
గుములుచుందురు మది కుహారము లందు!

ఆ తారకుడు భువి నపురూపమైన
సూర్యాశ్వముల గాథ గోరియాలచేత!
చూర్ణములైనట్టి సురుచిరం బయిన
మేలు పర్వత శిఖర మొఱవుల దెచ్చి!
క్రీడల కనువుగా గ్రీడింప దలచి
తన నివాసములను దగ నిల్పికొనియె!

బంగారు బద్మాల ప్రభలు శోభిల్లముగ
దిగ్గజ కలకల ధ్వనమై యున్న!
ఆకాశగంగ శ్రీ దేవేరి కిల పిలిచెను!
బంగారు పద్మాల ప్రభలెన్ని యున్న
ఆ తారకాసురు నప్రమేయమైన
అందాల కోలహాలు, నూరు కావునా!

తారకు భీతిచే దగ భంగము బంది
దివ్యులు తమ దివ్య తేజంబు లోడితె
ఆకాశ మార్గంబు లంకరించినది!
దివ్య విమానముల్ దిరుగుట మానె!
భువనముల్ చూచెడి బుద్ధిని విడిచి
నీలుగా మానము కాటిపించి రిపుడు!

యజ్ఞభాగము లెందు జెప్పగా మాకు
నాహుతి నీయంగ నసుర మాయావి!
అగ్ని ముఖంబున నట్టిలాగికొను
నారగించును మేము నలరి జూడగను!

ఆ తారకుని గర్వ మంతంబు లేదు
నేమిజేసిన గూడ నెదురేమి లేదు!
ఉచ్చైశ్శ్రవంబను నున్నతంబైన
యింద్రుని హయమును నితడు దొంగిలించె!
చిరకాల మూర్జిత సురల సత్కీర్తి
హరియింపబడియెనా దుష్టుచేతనె!
క్రూరుడౌ దారకుని క్రూరత్వ మడప
మా యుపాయములన్ని మన్నన గలిసె!

వీర్యవంతములైన వివిధౌషధములు
సన్నిపాతంబును జక్క జేయునొకో!

అంతియే కాదు మా కలరె సమ్మోహము
హరిచక్రమందున యాశలు గలవు!
కాని యా చక్రంబు గరిమ రక్కసుని
కంఠహారం బాయె గాదె! చిత్రంబు!

ఐరావతాదుల యాం గట్టించి
తారకు నేనుగులు వీరవిల్లెమునను!
పుష్కరావర్తక పొలుపు పాదముల
వప్రప్రకీర్ణంబు వర్షిల్లుచుండె!

కావున హే ప్రభూ! కర్మబంధముల
విడిపడు వాడెన్న విమల జ్ఞానమున!
కోరునో మాదొక కోరిక స్వామి!
మాకార్యమెన్నించి మమ్ము రక్షింపు!
ఆ తారకాసురు హత మొనర్పంగ
సేనానినొకనిని సృజియింపుమయ్య!

సురరక్షకుండయి శోభిల్లు వీరు
డుదయింప నింద్రుండు ముదముతో వాని
సేనాధిపతిజేసి చేకొని పోయి
శత్రుల దెగటార్చి శౌర్యంబుతోడ!
జయలక్ష్మి గొనిదెచ్చు జయజయ ధ్వనుల!
సృజియింపు నొకనిని సేనాని నిపుడు!
దేవగురుడిట్లు దేటదెల్లముగా
పలుకగా నా బ్రహ్మ పలుకు లిట్లుండె!

గర్జనల్ తరువాత గలుగు వర్షముగ
నోదార్పు ధైర్యముల్ నొందగూడు సతుల!

ఓ దివౌకసులార! నోర్పువహింప
గోరిక సిద్ధించు గొలది కాలమున!
ఎదురు జూడుడు! కాల మీరీతి గొంత!
కాని నేనీ కార్యమును జేయజాల!

ఈ [illegible]సుతు వృద్ధి నింతగా శ్రీని
నా చేతనే గదా ప్రియముగా నొందె!
అట్టి దైత్యుని నాశ మొనట్టు నాచేత
కాతమా బాడియౌనే? యరసి చూడగను!
విషవృక్షమును గూడ బెంచి తా దానె!
నఱకుట న్యాయమా? నయమది గాదు!

ఘోరమౌ దపముచే గొమరొక్క నన్వ
బ్రార్థింప జని వాని బ్రశ్నింప నతడు
దేవతల జేతను దిక్పాలజేత
మరణంబు లేకుండ వరము దా నడిగె!
జగముల గాల్చెడి శక్తి గట్టి
యాతపం బాపితి యావరం బిచ్చి!

రణరంగమందున రక్షించునట్టి
వీర విక్రముని యా విజిత తేజుని!
క్షేత్ర భాగంబున బ్రసవింపబడిన
యీశ్వర తేజోంశ భవుడైన గాని
ఆ రక్కసుని బరిమార్పగా దగను!
అన్యులు నెవరింప నలవిగా దతని!

తనుసుల కావల దకసియై యున్న
యా పరంజ్యోతికి నంత సాధ్యంబు!
విష్ణువు జేసెను వెలయు నా జేత
నతిశయ మహిమను నందగా నతడు!
పాండజాని పూర్ణ పురుషుండు పతిని
కలవి కానిదిలేదు నంత సాధ్యంబు!

కార్య కుశలురు మీరు గల్యాణ గుణులు
సంయమ స్థితినున్న శంభుని మనసు!
శుశ్రూష జేసెడి సుకుమారి గిరిజ
సౌందర్య గుణముచే సామీప్య మొంద!
తగ నయస్కాంతము దగులు లోహముగ!
ఆకృష్టు యత్నము నందుడు వేగ!

బ్రహ్మ రుద్రులైన బరమైనట్టి
మా బీజములు దాల్ప మహితు లీ బుధులు!
ఇరువురు మాత్రమే నింపుగా గలరు
శంభు తేజము దాల్ప శక్యమా యమను
ఇతరులు జాలరు నీ సృష్టియందు!
నా తేజమును దాల్ప నయముగా శివుని!
అష్టమూర్తుల యందు నలరెడినట్టి
జలములు మాత్రమే సామర్థ్య మగును!

ఆ యీశ్వరుని పుత్రు డింకట మీకు
సేనాధిపత్యము జెన్నుగా దాల్చి
శౌర్య విక్రమముల శత్రువుల జీల్చి
దివిజ కాంతుల జెఱ దీర్చి గాపాడ!

విబుధుల కిటు దెల్పి విశ్వవిధాత!
యంతర్హితుండయ్యె! నాశీర్వదించి!
మనసులో గర్తవ్య మహిమను నూహించి
దివిలోకవాసులు దివికేగి రపుడు!

హరుని స్వాధీనంబు నందు కార్యమున
మారుని సాహాయ మర్థింప దలచి!
పుష్పధన్వుని మది బోలుపుగా దలచె
పాకశాసను డంత బహు వేగముగను!

ఆ దేవతానాథు డలరి వేవేగ
మనసులో మర్మముగ మన్మథుం దలప!
రతి పద వలయముల్ రాజిల్లునట్టి
లలిత సుందరులైన లావణ్యవతుల!
సుందర భ్రూలత లందాల కొనలు
గల చాపమును దన కంఠమున దాల్చి!
మావి చివురాస్త్రముల్ మధునకు నిచ్చి!
ప్రాంజలి తోడుత ప్రభు శతముఖుని
బుష్పధన్వుడు జేరె పూలవానలను!

[ద్వితీయాశ్వాసము సమాప్తము]

# శ్రీ గిరిజా కళ్యాణము

## తృతీయాశ్వాసము

### (శివుని కంటి మంటచే మదనుడు భస్మమగుట)

పుష్పధన్వుడు రాగ బుల్కరించుచును
నానా హేమద్రుమం బంత నాదరంబునను!
ఎండలో దేవతలండజి నొడిలి
మదనుని గాంచెను మాధుర్య మొలుక!
ప్రభువుల హృదయముల్ పాదరసములుగ
సలలుగా జంచల మాశ్రితాలంచు!
కార్య ప్రయోజన కరణిని బట్టి
గౌరవ తిరస్కార గతి గల్గుచుండు!

అంతనా నాకవుం డతి మన్ననలను
తనదాపు కూర్చుండ దగు నాసనంబు!
చూపగా మదనుండు జూరలు గొనుచు
'నిదె ప్రసాదం' బంచు నిటు పల్కసాగె!

ఓ దివిజాధిపా! యో మహాపురుష!
సెలవిమ్ము నేదైన జేసెద క్షణము!
ఈ లోకముల యందు నేమి జేయగను
నాజ్ఞచే నను జేయు! మఱి ధన్యాత్మ!

ఇంద్రత్వమును గోరి యెవడైన గాని
దీర్ఘమౌ తపముల దేజస్సు కలుగ!
నీ సాయముగనుండి నిలిచెనా యేమి
కలుకము నా పూల బాణముల్ వేసి!

నీవు బల్కిన దంత నీయందు నిజము!
నాకు రెండస్త్రములిల నయముగా విజయము!
ఒకటి వజ్రాయుధ మొక్కటి నీవు
ఈ యాయుధములచే నే నిల్చి యుంటి!
తాపసు లెందరో తత్త్వవేత్తలను
నీ మహా యాయుధ మెందును గాదు!
నీవున్న నో! సఖా! నిఖిలము నాదు!
సర్వతోముఖమైన సాధన మీవు!

నీ సత్త్వ మెఱుగుదు నీ మహా బలము
నా నిముండవు గాన నయముగా నీపై!
గురుభార ముంచెద గూర్మి సేయగను
భూభార నాశక భూరి కార్యమును!
జూచియో గాదటే! సురుచిరంబైన
శేషుని బాన్పుగా జేకొనె హరియు!

ఓ సఖా! మన్మథ! యిపుడె బల్కితివి!
హరు నిబ్బరమునైన గడతు నంటివిగ!
దేవ కార్యము నీవు దీక్షగా నిపుడె
పూనికొన్నట్లయ్యె బోలుపుగా నీవు.
దైత్యుల బాధలు దపియించుచున్న
దివిజుల గోర్కెను దీర్పు! నా వినతి!

దైత్యుల గెలువంగ ధర్మంబు నిలుప
శివతేజ ముత్పన్న సేనాధిపతిని!
గోరుచు నున్నారు గూర్మి దేవతలు
ఆ మహాశివు డిపు డాత్మ సంయమము

హారుప్పైపై పూవుల వానలు [illegible]
వెడలుచు నంటివి విచిత్రగతుల
నీదె భాగ్యముగదా నీవె ధన్యుడవు!
అనితర సాధ్యమౌ యానమందె దీక్ష!
సాధారణంబైన సహజ కర్మంబు
బుడమిని సత్కీర్తి బొందును వాండు
ఘన కార్యములు జేయ గలుగదా కీర్తి?
ఘనులు జేతురు ఘన కార్యముల్ భువిని!

వేడుచుండెడి వారు వినుము! దేవతలు
ముల్లోకములయందు మోదమౌ కర్మ!
నీ బాణ మున్నదో నిండు సాత్త్వికము!
నీ కర్మ కికను మన్న కిదే సాటి!

ఈ వసంతుడు నీకు ప్రియమా సఖుడు
నీకు సహాయుడై నీతోడ నుండు!
అగ్నికి దోహదా నా సమీరణుని
ప్రేరణ జేయుచు శోభించి బంపుగారి?
దివిజుల కార్యంబు దీక్షగా జేసి
మన్నన సేయుము మహా నాదు మాట

అని పల్కె నింద్రుడంత నా మన్మథుండు
'పటులనే' యన పల్కె నతి వినయమున!
దేవ కార్యము జేయ-దివిజులు మెచ్చ
ప్రభునాజ్ఞ గైకొని బంటులు చేరంగ!
ఐరావతము జటచు హస్తంబు తోడ
సుర రాజు దీవించె సుందరంబుగను!

అంత నా మదనుడా నతి సోయగమున
ప్రభు దీవెనల నంది ప్రభలు జిందుచును!
సఖుడు వసంతుండు సతి రతీదేవి
శంకతో వెంటను జనుదేర గాను!
ప్రాణంబు వోయిన ప్రభు కార్యసిద్ధి
జేయు సాహసముతో జెలు వగప్పనను!
హిమ పర్వతంబున నింపుగా నున్న
స్థాణ్వాశ్రమమునకు జయ్యన వచ్చె!
ఆ శివాశ్రమమున యుల వసంతుండు
తపసుల దపముం దగ ప్రతికూల
మైన తన నిజరూపు నలరంగ దిశలు!
మదనుని కార్యంబు మదియందు దలచి
చివురుల బూవుల జెన్నారుచుండ
గొండంత వ్యాపించె గోటి యందాల!

వాసంతు డావిధి వన్నెలజింద
వాసంత ఋతువును నలవుల జిందె.
ఉత్తరాయణమును నుదయంబు నందె
దక్షిణ పవనముల్ దరికొని వీచె!
చిగురుల పూవుల చిత్రముల్ వెలసె
తీగెలు పొదలను దీర్చె సొంపులను!

ఆ వసంతుని సృష్టి యతి విచిత్రంబు
వన మాత బాణంబు లావణ్యముగను!
పల్లవాంకురములు బత్రముల్ గాగ
తుమ్మెద బంక్తులన్ దోలకంగ జేసి!

మదను నామాక్షరాల్ మర్మముగ జెక్క
ననిసించు జిత్రమును నందాలు జింద!

ఆ యశోకము బూచె యారి శోభలను
నవ పల్లవములను నవ పుష్పములను!
వారాణి యందెల బాద తాడనము
దోహదమే లేక దోలుకాడుచుండె!
నవ వసంతము రాగ నవరాగ రుచుల
నా యశోకము బూచె యతి సువాసనల!

వాసంత ఋతువున వన్నెలం జిందు!
కర్ణికారము బూచె గనుపియ ముగను!
వన్నెలా యధికము! వాసన జిన్న!
మనసున ఖేదంబు మసలుచు నుండు!
ధాత్రి సృజనమున దగ నెందు జూచ
నెద్ది యో లోపంబు నద్ది నట్లుండు!
అవికాన భావము నతి యెఱ్ఱనైన
చంద్రవంకల శోభ జిందుచు నుండు!
మోదుగ పుష్పాల మురిపాల జూడ!
మనసున మంజుల భావముల్ వెలయు!
ఆ వసంతుని తోడ నా వన స్థలులు!
నఖక్షత లందిన నవ్యతల్ దోచు!

తుమ్మెదల్ రాగాలు దూలి పాడగను!
తిలక పుష్పము బూచె దీయగా లతలు!
బాల సూర్యుని భంగి ప్రభలు జిందుచును!
లత్తుక రాగాల లావణ్య మొప్పె!

గండూష జలముల గడమున కిచ్చె
వలపు జూపులు జూచి నన్నలం జిందె !
చక్ర వాకంబును నగ మాహరించి
తామర తూటిని సఖికు కందించె !
అనురాగముల చేత నా ప్రియురాలి
చక్కిలి గింతల దన్మయము జేసె !

శ్రమ వారి బిందువుల్ సఖి మోము పైని
మకరికా పత్రాల మాధురిం జెలుప !
పుష్పాసవంబుల బొలుపుల జిందు
ఆఘూర్ణితంబులౌ యలరు నేత్రముల!
కిన్నెర మీటుచు గీతము బాడ
సఖియ మోమును జూచి సరసత జిలుక !
ఆపలేకను ప్రేమ యలరి కిన్నెరుడు
చుంబనం బొనరించె జూఱలం గొనుచు !

పూగుత్తు లనియెడి పొలుపు బాలిండ్ల
చివురులను బెదవుల జెన్నొందు కాంతి !
వనలతాంగన లవుడు వలపుల జింది
వంగిన గొమ్మల ప్రాలెను ప్రీతి !
వృక్ష నాయకులును విచ్చిన ప్రేమ
కొమ్మ లనియెడి దీర్ఘ కూర్మి బాహువుల !
కౌగిలింతల నంద కాంతల గూడి
యుయ్యాల లూగెను వయ్యారముగను !

ఆ వసంతము నందు నా మహేశ్వరుడు
అప్సర గీతము లాట పాటలను !

ఆత్మానుసంధాన మాసక్తి మునిగి
వినిపించు కొనడాయె వేడుక బడకు!
ఆత్మానుసంధాన యోగీశ్వరులకు
స్వాధీన చిత్తులౌ సాధు పురుషులకు!
అంతరాయము గల్గి నగచాట్లు బడరు
నియమ నిగ్రహముల నీతి గోల్పోరు!

ఆ శివాశ్రమ ముందు నా లతా గృహము
ద్వార ముందున నిల్చి యరసి ప్రమథులను!
బంగారు బెత్తము బట్టి నొక చేత
కుడిచేత తర్జని గొమరొప్ప నెత్తి!
చాంచల్యమును వీడి చపలత మాని
శాంతి వహింపంగ సైగను జేసె!

ఆ నందికేశ్వరుడు నటుల శాసింప
ప్రమథులే కాదు నవ ప్రాణి కోటియును!
కదలదు వృక్షంబు గలికి తుమ్మెదయు
ముని సంఘ మంతయు మునిగెను శాంతి!
కోకిల బలుకదు కులుకదు నెమ్మి
ఖగసమూహం బంత కలకిల మానె!
చిత్రకారుడు వ్రాయు చిత్రంబు బగిది
ఆ వనం బంతయు నటు మారిపోయె!

శుక్ర గ్రహంబును సూటిగా బోయి
పయనం బొనర్పంగ భయపడు రీతి!
ఆ నందికేశ్వరు నటు వేగ దొలగి
ప్రక్క ప్రక్కల నున్న ఫలపుష్ప తరుల!

పుష్ప ధన్వుడు దాటి బోలు పొంద జూచె
ధ్యానాస్పదుండైన తన భూత పతిని !

అటు దేవ దారుల నలరు వేదిను
బఱచిన శార్దూల చర్మంబు మీద !
సంయమ సిద్ధిలో దగిముగ్ని దేలు
యాశీనుడై యున్న యా కృత్తివాసు !
ఆనంద మూర్తిని యా పరంజ్యోతి
ఈశ్వరు ! పరమేశు ! జగదీశు ! శివుని !
చావు దగ్గఱకొచ్చి తన పట్టువిగు
మదనుడు బొమగాంచె మహనీయ జ్యోతి !

వీరాసనమునందు విమల భావమున
కరముల దొడలపై గ్రమ్మిన దాల్పు !
ఆశివు గిరములు నలు సొంపు లూని
దామర పూవులు దగ బూచినట్లు !
ఆ పరమేశ్వరు ! నా సదాశివుని
పంచ బాణుండంత గాంచె గన్నులను !

కాల సర్పంబుతో గట్టిత బడిన
హర జటా జూటంబు నలరె కాంతులను !
అక్షసూత్రము జెవి నలరారుచుండి
వింత తేజసును వెదజల్లు చుండె !
నీల కంఠము లోని నిగ్గులను దొఱుకు
లేడి చర్మము దాల్చి లీల యోగమున !
అలరెడి బరమేశు నా సదాశివుని
బంచ బాణుం డంత గాంచె కన్నులను!

కాంతి నైశ్చల్యంబు గనఁ గ్రుడ్లు భయము
కను బొమల్ స్థిరములు కంటి రెప్పలును!
అరమోడ్పు కనులను విరియు కాంతులను
గ్రింద ముఖంబునం జిందెనో యనగ!
ముక్కున లక్ష్యంబు ముడివెట్టబడిన
యోగము నందున్న యోగీశ్వరాత్ము!
ఆ పరమేశ్వరు నా సదాశివుని
బంచబాణుం డంత గాంచె గన్నులను!

మెఱుపు లుఱుములు లేని మేఘంబు వలెను
అలలు దొల్కని నీటి కొలని భంగిగను!
నిర్వాత స్థలమున నిశ్చలం బయిన
దీపంబు మాడ్కిని దేజరిల్లుచును!
ప్రాణాది వాయువుల్ బట్టి బాధించి
ఆత్మసంయమమున నలరి యున్నట్టి!
ఆ పరమేశ్వరు నా సదాశివుని
బంచబాణుండంత గాంచె గన్నులను!

నేత్ర మధ్యమునుండి నిడివిగా జనుచు
బ్రహ్మ కపాలంబు పై కేగి యెగసి!
జ్యోతి ప్రవాహముల్ కాంతివ్యాపింప!
శిరమున దేజంబు జిందగా నపుడు!
తామరతూటి దారము సున్నితంబు
బాలచంద్రుడు గూడ వాడె ననిపించు!
అట్టి దపసున యున్న యా సదాశివుని
బంచబాణుండంత గాంచె గన్నులను!

నవరంధ్ర ద్వారముల్ నయముగా గట్టి
మనసును హృదియందు మహిత సమాధి!
నిలిపి క్షేత్రజ్ఞు లతి నిర్మల భక్తి
యే నాశరహితుని యే పరమాత్మ
తెలిసికొం చుందురో తేట తెల్లముగ
యట్టి యా పరమాత్మ నవలోకనమున!
నన్నట్టి యాహరుని యున్నతోన్నతుని
బంచబాణుం డంత గాంచె గన్నులను!

అట్టి యా పరమేశు నా త్రిలోచనుని
గని గాని మదనుండు గటగట పడియె!
చూపశక్యముగాక జూడ్కులు జలింప
భయమున వణకుచు బట్టు దప్పుచును!
శరచాపములు చేయి జారినం గూడ
తెలియకబోయెగా గలయంగ మనసు!

తన మనోధైర్యముల్ దగ వ్యర్థములుగ
వీర్య దేజంబులు విగతమై బోవ!
సౌందర్య గుణముచే నందముల్ జింద!
తన నాదుకొనగ దా దరలివచ్చినదో!
వనదేవతలు వెంట ననుసరింపగను!
సకల లోకేశ్వరి సౌందర్య రాశి
ఆ పార్వతీదేవి యచటికిన్ రాగ
బుష్పధన్వుండంత బోలుపుగా గాంచె!
కెంపుల శోభల సొంపిల్లు చుండ!
నా యశోకపు బూలు నలరారె గురుల!

బంగారు కాంతులు బొంగారుచుండు
కర్ణికారము జేరె కర్ణంబు లందు
ముత్యాల శోభల మురిపెముల్ జిందు
వావిలి బూదండ యొప్పె హారముగ!
వాసంత ఋతువున వనముల విరియు
బూవుల ధరియించి పూబంతి వోలె!
పరమేశు సన్నిధికి పార్వతీ రాగ
పుష్పధన్వుండంత పొలుపుగా గాంచె!

స్తన భారమున బహు సరసత నొప్పి
అరుణార్క రాగముల్ సతిశోభం బొప్ప
వస్త్రముల్ ధరియించి వయ్యారముగను
పూలగుత్తుల బర్వ పొలుపుగా నొంగి!
చిగురుల యందాలు చిత్రముగ వెలసి
లాలిత్యగతి బోవు లతయేమొ యనగ!
పరమేశు సన్నిధికి పార్వతీ రాగ
పుష్పధన్వుం డంత పొలుపుగా గాంచె!

పార్వతీదేవి కటి విరిసిన పూల
పొగడ దండను జూడ పొలుపుం జిందు!
స్మరుని బూవింటికి సంధింప బడెడి
మఱియొక మౌర్వి యన నుహిం గోచరించు!
మాటిమాటికి జారి మాధుర్య మొలుకు
అవలంబమానమై యలరు సుందరిని!
పరమేశు సన్నిధికి పార్వతీ రాగ
పుష్పధన్వుం డంత పొలుపుగా గాంచె!

సురుచిర నిశ్వాస సుందరత గోరి
బింబాధరము జెంత బ్రీతి జరించు!
సంభ్రమ మగుదృష్టి సరసలోలతను
మసలెడి తుమ్మెదను మాటి మాటికిని
లీలార విందంబు లీలగా విసరి
వారించు చున్న యా వనిత కల్యాణి!
పరమేశు సన్నిధికి పార్వతీ రాగ
బుష్పధన్వుం డంత బొలుపుగా గాంచె!

రతియైన సిగ్గువడు లావణ్యమూర్తి
సర్వాంగయముల సౌందర్య మొప్ప!
అందాల రాశియా నెరు పార్వతిని
మదనుండు జూచి తా మది నిశ్చయించె!
దుర్దయుం డైన యా శివుని కార్యమున
తన గార్యసిద్ధిని దగు నాశ జెందె!

ఆ పార్వతీదేవి యా శైల తనయ!
కాగల పతియైన కల్యాణమూర్తి!
ద్వారప్రదేశమును దరిజేరె నంతె!
వీక్షింప సాగె నా విభుని యాజ్ఞలకు!
పరమాత్మ యనుపేర బరగు నా జ్యోతి!
యాత్మను దర్శించి యానంద మయుడు
యోగము జాలించె యోగీశ్వరుండు!
తపసును జాలించె తగ నీశ్వరుండు!

బంధించి వాయువున్ బరగ నా శివుడు
తపసున నున్నపుడు దగ దేలికగను!

తన ఫణాగ్రములతో ధర మోయుచున్న
ఆ యాదిశేషుడు నా సహస్ర ఫణి
ధరను మోసినవాడు తానంత శివుడు!
దపసును వీడంగ దగ కష్టమాయె !
శివుడును నుచ్ఛ్వాస నిశ్వాసములను
వీరాసనము వీడె వేడుక మీర!

నాగభూషణునకు నందికేశ్వరుడు
వందనంబులు జేసి జెంది వినయంబు
శుశ్రూషకై వచ్చె సుమతి యని పలికె!
బలుకగా గనుసన్న జిలికె నీశ్వరుడు
ఆ నందికేశ్వరుడు నా శైలసుతను
యనుమతించెను లోని కరుగ శుశ్రూష !

ఆ పార్వతీదేవి యా సఖీజనము
చిగురులు తానంత చిత్రములైన !
తోరంబు గిరిజ దా గ్రుచ్చిన పూలు
నా పరంజ్యోతికి యా సదాశివున!
పాదసన్నిధియందు ప్రణాములు మ్రొక్కి
వెదజల్లినా రపుడు వేడుక మీర!

పార్వతీదేవియు బరగ నా భవుకు
ఆత్మవనసాకార మర్పించె నపుడు!
నీలాలకములందు నిండు శోభలను
నవకర్ణికారంబు నయముగా జార
కర్ణమం దుంచిన కాంతి పల్లవము
జారునటు వంగుచు దర్శించి మ్రొక్కె !

మ్రొక్కిన శైలజన్ ముదముతో శివుడు !
నాశీర్వదించెను సలరి శుభదృష్టి !
"సవతులు లేనట్టి సతివి గమ్మంచు!
ఉత్తము పతిదేప్ర నొందుమా!" యంచు
ఆమాట నిజమాయె నటులెయగా గాద !
మహితాత్ములగు వారి మానితంబైన
వచనముల్ వృథగావు వశ్య వాక్యములు !
బరగ సత్యము లౌను బాటిల్లు ధరను !

పూలబాణము వేయ బూని మన్మథుడు
నెదురు జూచుచుండె వేడ్క శివార్థ !
అగ్నిబడి మిడుత దా నంతమౌ రీతి
పోగాల మొచ్చిన పురుషుని వోలె !
పరమేశ్వరుని యొద్ద పార్వతి యుండ
గమనించి మదనుడు గ్రక్కునన్ శరము
ఎక్కువెట్టిన వింటి నింపుగా మార్చి
మాటిమాటికి ముట్టె మది దొట్రుపడగ !

మందాకినీ యందు మెండుగా బూచి
వికసించు దామర విత్తులం దెచ్చి !
సూర్యకాంతుల జేత శుష్కింప జేసి
యక్షసూత్రము జేర్చె యాశైల తనయ !
ఆలోక కల్యాణి యాగిరి పుత్రి
యా మహా తపసికి యాత్రిలోచనుకు
అరుణారుణములైన హస్తాల చేత
నర్పించె జపమాల నతిభక్తి తోడ !

ఆశ్రిత రక్షకుం డా మహాశివుడు !
తావళంబును గొన దగ సమ్మతించె
అదె ! సమయం బని యా మన్మథుండు
సమ్మోహనాస్త్రము సమ్మోదముగను
విడువగా నుంకించి వేడుక మీర
తనవింట సంధించె తడబాటు వడుచు !

మదనుడా బాణంబు మఱి వేయ నపుడు
హరుని ధైర్య మొకింత యట్టిట్టు లూగె !
చంద్రోదయారంభ సంద్రంబు మాడ్కి
గాలికి గదలెడి కలువపూ విధము !
బింబాధరోష్ఠయా యంబ మోమునను
తన విలోచనములు దన్మయంబందె !

ఆ సమయంబున యా శైల తనయ
శృంగార భావాన దులకించె నపుడు !
అప్పుడే పూచిన యందాల కడిమి
పులకించి నటులుగా బులకరించుచును !
సిగ్గుతో నిండియు నిగ్గు లొల్కంచు
బెదరిన కనుజూపు బేల తనంబు !
ముఖమున గాంతుల ముత్యాలు గురియ
తల నడ్డముగ ద్రిప్పె తరుణి యా గిరిజ !

అంతట నా శివు డా జితేంద్రియుడు
మనసు వికారమై మది చలించుటను !
తనకు దానే మది తన నింద్రియముల
తనవశమును జేసి తగ నివారించి !

ఈ చిత్త కల్లోల మీ చంచలతకు
కారణంబును గన గలయంగ జూచె!

నాలుగు దిక్కుల నరయంగ శివుడు
ఒక ప్రాంతమున గనె నొకరంగ మదను!
కుడికంటి జిలుగు గిదారుగా ముష్టి
నారి సారించుచు నయగారమున!
వంచిన భుజములు నొప్పగా నుండి
యొడమ కాలును వంచి ముందిలాకార
మునయున్న ధనువును మోదమున వంచి!
పూలబాణములను బోలపుగా వేయ
ఊపిరి బిగబట్టి యుత్సాహ గరిమ
నుద్యుక్తుడై యున్న మదనుండు బొడమె!

ఆ త్రిలోచను డంత నా స్మరు జూచి
యతికోపమును జెంది యలరె క్రోధమున
తపసు సంపూర్ణ్యచే దగ వృద్ధి నొంది
కోపము దాపము గొమరొప్ప గూడి!
చూడశక్యముగాని జూడ్కుల తోడ
నతిభయంకరుడయ్యె నా త్రయంబకుడు!
మూడవ కంటిని వెడలె నగ్నులును!
జ్వాలలు మెఱుపులు గాల సర్పముగ!

ఓ ప్రభూ! ఓస్వామి! ఓ మహాదేవ!
ఆశ్రితరక్షణా! యానందమూర్తి!
శాంతింపు! శాంతింపు! శాంతింపు మనుచు!
ఆకాశ మందుండి యా దివౌకసులు!

పలుకుచుండగ నంత బంచబాణుండు
భవునేత్ర వహ్నిచే భస్మంబు నాయె!
మదనుని భార్యయా మాధుర్య మూర్తి!
ఆ రతీదేవి యదంతయుం జూచి!
భర్త భస్మంబౌట భరియింప లేక
మూర్ఛ నందెను మోహంబు గ్రమ్మ!
భర్త్ర వియోగంబు బాధింపకుండ
నుపకారమే మోహ మొప్పగా జేసె!

ఆ తపోనిష్ఠుడు నా త్ర్యంబకుడు
తన యోగ దపముల దగ భంగమనుచు
పిడుగు వృక్షము గూల్చి యడచెడి రీతి
మదనుని సమయించి పారుష్ణ మందె!
స్త్రీ సన్నికర్షంబు ఛేదించు నిచ్ఛ
బ్రమదులతో గూడ పరమేశు డపుడు
జనె నెటో దూరము గనిపించకుండ!
ఆ కొండ నొక చోట నలరె ధ్యానమున!

ఉన్నత శిరస్కుండు సర్వభారకుడు!
తన దండ్రి కోరిక దగవ్యర్థమగుట!
తన యందచందముల తన మనోరథము!
భంగము లగుటచే భరియింప లేక!
ఈ యవమానంబు నీ పరాభవము!
తన చెలు లెదు టిట్లు దారసబడుట!
కడు సిగ్గుతో గౌరి కలతభావమున!
భవనాభిముఖియౌచు బయనమై పోయె!

రుద్ర కోపంబుచే యద్రిజ యపుడు
కలతను భయపడి కనులర మూసి!
చింత జెందుచు నున్న జిన్నారి జూచి
హిమవంతు డపుడు దా కొమరిత జేరి!
చేతులం బట్టుక జేరదీసికొని!
దంతలగ్నంబైన తామర దూటి!
నైరావతము వలె నటు కొని పోయె!
దీక్షీకృతాంగుడై దిశ తన గృహము!

తృతీయాశ్వాసము సమాప్తము



# శ్రీ గిరిజా కళ్యాణము

## చతుర్థాశ్వాసము

### పతి వియోగముచే రతీదేవి విలపించుట

ఆ మన్మథుని భార్య యారతీదేవి
యా త్రయంబకు జేత నటు తన భర్త!
భస్మమాటను గాంచి పడెను మూర్ఛలను!
నటు కొంతసేపటి కలరి తేరకొని
ఆ మహా సతి రతి యడలి గొంతెత్తి
నూత్న వైధవ్యంబు వెతను శోకించె!

మూర్ఛ దేరిన రతి మోహముం బాసి
యువధానబరముగా నటునిటు గాంచె!
తన విలోచనములం దశదిశల్ బఱపె!
గనబడదయ్యెగా గాంతుండు మరుడు!
తన పతి గాంచగా దత్తర పడుచు
వేదనా శోకముల్ వెంబడింపగను!

ఓ జీవితేశ్వరా! ఓ ప్రాణనాథ!
-జీవించి యుంటివా? జీవంబు తోడ?
అని లేచి దుఃఖాన నాయాస బడుచు
కట్టెదుట గాంచెను కలికి యా ధరణి!
హరుని గోపానల నాహుతిం బొంది
పురుషాకృతిని యున్న బూడిద ప్రోవు!

మఱల నేలను వడి మది మోహమంది
భూమిపై బొరలుచు భోరున రోదను!

ధూసర వర్ణంబు దూలు సంగముల
విరిసి వ్రేలాడెడి కురులతో గూడి!
ఆ శివాశ్రమ ప్రాంత మంతెను గూడ
సమదుఃఖ భూమిగా సఖియ వే జేసె!

లోకోత్తరమునైన లోకాన లేని
సుందరంబైన నీ సుకుమార దేహ!
మీగతి నొందెనా? యెట్టి చోద్య మిది?
హా ప్రాణనాథ! నిన్నరసి యీ విధము!
బ్రతికి యుంటిని నేను భాగ్యహీనతను!
కఠినులు స్త్రీలందు గద నిక్కువంబు!

నీరము లేకున్న నీరజం బెటుల
వేయి రేకలతోడ వికసించి మించు?
నీవు స్వాధీనమై నిలిచి జీవించు
వదలి యన్నెటు బోతి వెనుకుదు నిన్ను?
ఆ స్నేహ మా భావ మా ప్రేమ లతను
త్రుంపి వేసితివిగా దుత్తూలికలుగ!

నీకు నేనును నాకు నీవును గూడ
నప్రియంబులు గాని యకృతంబులును!
జరిగిన సంగతి జాడలు లేవు!
మఱియెందు కిట్టుల మమత బాసితివి!
నిను జూడ దుఃఖంచు నీ రతి నిటుల
దపియింప న్యాయమా? దర్శన మీవ?

రాత్రి వేళలయందు రతివేళ లందు
ఆనందమున దేలి యలరెడి యపుడు!

గోత్రస్ఖలితమునఁ గోపంబు నంది
మొఁ నూలితో నిన్ను మెలివి పెట్టగను!
నల్ల గల్వను గొట్ట నాథ! నీ కనుల
బుప్పొడి వడి బాధ నొందిన మతిని
ఈ విధి నను విడి యెటకు బోయితివో?
యీ తప్పులిక జేయ నింక మన్నించు!

"ఓ రతీ! ఓ సఖి! ఓ ప్రియా! వినుము!
నీవు నా హృదయమందు నిలిచి యుంటివిగ!"
అని బల్కితివి నాడు! ఆ మాట కల్ల!
మాసిపోతివి నేడు మమతల ద్రోసి!
ఆయుల నీవై పోన నేయువలె నేను
జీవించి యుంటిని జీవితేశ్వరుడ?
నన్ను రంజింపంగ నాథ! బల్కితివి!
యిది నీకు దగునేమొ! యోజించుకొనుము

నను శోకమున ముంచి నా ప్రాణనాథ!
పరలోకమునకు వే పయనమైతివిగ!
అనుసరించెద నిన్ను నాలసింపకనుగ!
నే విచారింప సఖి! నేను నా కొఱకు!
ఆ విధి వ్రాతచే సతుల వంచితులు!
సర్వ జీవులకునై సంతాప బడెద!
నీ యధీనము గదా! నిఖిల సౌఖ్యములు
జగతి గతేమౌను? జనుల గతేమి?

రాత్రి జీకటులచే రాజ మార్గములు
ఘన మేఘ గర్జనం గలతల పడెడి!

కమనీయ ముఖులైన కాంతల వేగ!
ప్రియులను జతగూర్చి ప్రీతి పొదరిండ్ల
పంపెడి నాథుండు బరగ నింకెవరు?
ప్రియసమాగమముల బెంచువా రెవరు?

అరుణ నేత్రములను నటు నిటు ద్రిప్పి
మాటలం దొట్రిల్లి మాటికిం దూలు!
ప్రమదల యానంద వారుణీ మదము!
నిష్ఫలం బాయెగా నీవు లేనట్టి!
జగతి శూన్యముగదా సకల జీవులకు
నానా విలాసముల్ నటనలా గాద!

ఓ నాథ! నీదేహ! మొందిన గాథ!
సఖుడైన చంద్రుండు చలియించి మదిని!
తన వాల వెన్నెల తగ వ్యర్థ మనుచు
కృష్ణపక్షము దాటి క్రొంగ్రొత్త వెలసి!
తన కృశత్వంబును తెనదు దుఃఖముగ
క్రమముగా నొందులుచు గలత నున్నాడు!

పసుపును యెఱుపును బాలు బంచుకుని
తొడిమతో గూడుక దోరంపు సొగసు!
పుంస్కోకిలలచేత బొలుపుల జిందు
రాగాల భావాల రసములం దేలు!
నవచూత ప్రసవము నాథ! నీ శరము!
యెవరి కార్ముక శర మికమీద నగునో!

నాథ! యీ యళిపంక్తి నయముగా గనుము!
యెడలుచు నున్నవి నటునిటు దూలి!

కఠినులు రక్కసుల్ గాద దేవతలు?
ఆలుమగలను జీల్చి యాటలాడుదుర?
ఒక పాదమందు నీ నొనర వారాశి
దీర్చగా నింతలో దేవతల్ బిల్వ!
దేవకార్యము దీర్చ ధీరత్వమునను
నెటు బోయితివో నాథ! వేగ రా రమ్ము!
దక్షిణ పాదముం ధన్యతం గూర్చ
రాగర జితముగా రంజిల్ల జేయ!

ఓ నాథ! వచ్చితి! నొక క్షణ మాగు!
స్వర్గలోకము నందు జాణలౌ స్త్రీల!
వలచకుండ నే వచ్చెద నిదిగో!
నీ సుందరాంగాన నీటుగా నుండు!
సహగమనము నంది నరగున వత్తు!
అగ్ని మార్గము నందు నరగ మునుమున!

ఓ నాథ! ఓ స్వామి! యొక మాట వినుము!
అనుసరించియు నిన నైన నీ దాన
మడనుండు లేకుండ నెట్టి రతీదేవి
క్షణము జీవించెనని జను లాడు కొనర?
ఈ లోక నిందను నే నెటుల భరింతు?
నీవు లేకుండ నే నెట్టుంటి బ్రదుక?

ఓ జీవితేశ్వరా! ఓ రతీ నాథ!
యూహా కందని గతి నొంది పొందితివి!
పరలోకమున కేగి భస్మమై యున్న
అన్య మంపున మెటు లరి నే జేతు?

జీవ దేహంబులు జీర్ణ మాయె గద!
యీ స్థితి నొందితి వెందైన గలదె?

ఉత్సంగమున ధను వొప్పగా నుంచి
శరమును దిన్నగా జక్కజేయుచును!
వాసంతు దోషిత వక్త్ర లొల్కుచును
మధుర వాక్యములతో మాటలాడుచును
తిలకించి క్రీగంట దేలించు నన్ను
మధుర మూర్తిని నిన్ను మరునుం దంతు!

నా హృదయంగమా! నా ప్రాణనాథ!
నీ కార్యమునకు నిందు దోసిలులు!
పూలను బంపించు పుణ్యవంతుండు
నీ కిష్టుడైనట్టి నీ ప్రాణ సఖుడు!
వాసంతు డెవ్వాడ వన్నెల రేడు!
కనిపింప డాయెగా గానంగ రాడు!
మారుని గోపాగ్ని చే నాహుతియైన
మదనుని గతి నొందె బ్రాగ్గ లేదు గద!

ఆ రతీదేవి యిట్లు రి శోకింప!
బరిదేవితా రోదనం బవివి చెవుల!
వినలి ప్త ముఖములై వేయుశాఖాలు
హృదిని గ్రుచ్చిన రీతి మదివంత నొందె!
వాసంతు డదివిని వచ్చె వేవేగ!
ఆ రతీదేవిని యలరి యోదార్చ!

ఆ వసంతుని జూచి యా రతీదేవి
గొంతెత్తి శోకించె గోటి వేదనల!

ఉరమును మోదుచు నుద్వేగ గతిని
ధరణిని బొరలుచు దరుణి రోదించె!
దుఃఖితులగువారి దురపిల్లు మనసు
బంధు మిత్రుల జూచి బైకుబుకు లేచి!
తెఱచిన వాకిలిని బరుగున వచ్చి
అడ్డు లేకుండగా సంతసం దొరలు!

ఆ వసంతుని తోడ నా రతీదేవి
భోరున నేడ్చుచు బొసగ నిట్లనియె!
చూడు వసంతుడా! సుకుమారుడైన!
నీ మిత్రు స్థితిగతి నిలిచి యొక్కింత
పారావతము రంగు భస్మముం గనుము!
గాలికి నెగురుట గంటివా యెదుట?

ఓ నాథ! యిటు జూడు! నొసగు దర్శనము!
ఇదె మాధవుడు గను మిష్ట సఖుండు!
నిను జూడ నాసక్తి నిలిచి యున్నాడు!
నతని నైనను గను మాసక్తి తోడ!
జాస్థిగములై యుండు నతి చంచలములు!
బురుషుల స్నేహంబు పొలతుల యందు!
మెలివడు ప్రౌఢగా మిత్రుల యందు
స్థిరముగా నుండును ధీరత మెఱసి!

బిసతంతువుల నారి ప్రియ మొప్ప గలిగి
కోమల కుసుమముల్ విను బాణములు!
అట్టి నీ ధనువుకు నఖిల లోకములు
యాజ్ఞానువర్తులై యణగి యుండెడివా!

హా నాథ! యట్టి నీ యతుల శక్తికిని
గారణ భూతుడై గదు స్నేహ రక్తి!
నీ పార్శ్వ వర్తియై నిలుచు వాసంతు
నతని కైనను నిమ్ము నలరి దర్శనము!

ఓ వసంతా! విను! మొక మాట యొకరి
నీ ప్రాణ మిత్రుండు నీదు చెలికాడు!
గాలి వ్రేటున సోలి తూలి దీపమ్ము
నారిపోయిన విధ మస్తమయమొందె!
తిరిగిరా డిక సుమ్ము! దేరి జూడు నను!
ఆరిన దీపమ్ము నా మన్మథునికై
ధూమ మను దుఃఖాన దురపిల్లుచున్న
వత్తిగా నుంటిని వంది గుందుచును!

ఆ విధి చైదంబు నాశ్చర్యకరము
గాముని వధియించి గడగి నన్నాడ!
వధియింప కుండుట నొప్పుగా నేను
సగము జచ్చినయట్టి దాన నై తినిగ!
అనపాయమని ద్రుమ మాశ్రయ మంది
యున్న లే లతకూన నుద్వేగ గజము
ఆశ్రయ ద్రుమమును నటు పెల్లగింప!
తీగె కూలిన రీతి తీరాయె బ్రదుకు!

ఆ పంచ బాణుతో నలరి నే గూడ
మరణించితిని గాన మాధవ! వినుము!
కావున తదుపరి కార్య మూహించి
నా చితి బేర్పుమా! దయముగా నీవు!

అగ్ని ప్రవేశంబు నాకిప్పు డేల?
అగ్ని కార్యము జేసి యాహుతి నిమ్ము!
పతి చెంత జేర్పంగ బిలిచి వే జేర్పు!
బంధు కృత్యము దీర్పు బరగ వే దయను!
చంద్రునితో జను జారు చంద్రికయు
మేఘముతో బాటు మెఱుపు నశించు!
ప్రమదలు జనుచుంద్రు పతిమార్గ మందు!
అందఱి కిది తెలియు నవివేకులకును!

తెలియు నందఱి కిది తేటతెల్లముగ!
ఇదె జూడు! ధరణిపై నిగ్గులింపారు
ప్రియగాత్ర భస్మంబు ప్రేమ మీరగను!
నా శరీరము నంత నలరి బూసికొని
సుందరంబైనట్టి సుకుమారమైన
చిగురుం బాన్పున జేర్చినట్టుగను!
నా చితాగ్నుల యందు నలరి యుంచెదను!

ఓ పూల వాసంతి! ఓ ఋతురాజ!
ఓ సౌఖ్య! ఒకమాట! యొప్పగా వినుము!
పూలపాన్పులు మేము బొసగ గూర్చుటను
సాయంబు జేసితి సరసత నాడు
అంజలితో నేడు నర్థించు చుంటి
అగ్ని శయ్యను గూర్పు మతి శీఘ్రముగను!

వేగ నా చితియందు నగ్ని నర్పించి
దక్షిణ వాయువుల్ తగ వీచు నటుల!

చేయుమా! వాసంత! చెప్పగా నేఁ?
నీ ప్రాణ మిత్రుండు నీ ప్రాణ సఖుఁడు!
క్షణమైన కన్నోడి చక్క నుండడని
తెలియుగా వాసంత! చెలికాని మనసు!

ఇంతియే కాదయా! యింకొక్క మాట!
యాకోర్కె దీర్పుమా యిష్టమిది మాకు!
నా చితి నగ్ని యిడి నయముగా నీవు
నొక జలాంజలి నిమ్ము నొప్పగా మాకు!
పరలోకముల యందు బరుగు నీ సఖుఁడు!
అవి భాగ్యముగ ద్రావు నలరి నాతోడ!

అంత మాత్రము కాదు! యాలింపు వినతి!
బరలోక విధులను బాటించు నపుడు!
పిండోదక క్రియల బొందుగా మాకు
చిన్నారి చిగురుల జట్టి బూవులను!
ఆమ్ర పూ గుచ్ఛంబు లతి ప్రేమ నిమ్ము!
నీ సఖు రుచు లేవో నీకునుం దెలియు!

అటుల శోకించెడి యా రతీదేవి
దేహ త్యాగమునకు దివిరి పూనుకొనె!
వినువీథి యందుండి వినవచ్చె నంత
యశరీర వాక్యము లలంరించు రీతి!
మడుగెండి తడబడు మత్స్య కన్యకలు
తొలకరి వానలం బులకించు రీతి!

ఓ సతీ! ఓ రతీ! యోర్పును వహింపు!
శోకంబు మానుము స్రుక్కకు మదిని!

నీ భర్త జీవించు నిజముగా నమ్మ!
మిహితగా నెగురుచు మిలమిల నాడి!
హరుని నేత్రాగ్ని నాహుతిం బొందె!
కలికిరో! తెలిపెద కారణ మేమొ?

ఆనాడు మన్మథు డా ప్రజాపతిని
బూల బాణంబుల బులకింప జేసి!
కూతుపై మోహంబు గూర్చినా డకట!
యది గని యా బ్రహ్మ యాగ్రహం బంద!
శపియించె నీ పతిన్ శంకరు కంటి
మంట మాడు మటంచు మదను డిట్లయ్యె!
చేతులారగ జేయు జెడు కర్మ ఫలము
ననుభవింపగ దీర దనుమాన మేల?

మదను శాపము దీరు నద నెప్పు డనుచు
నా ప్రజాపతి ధర్ము డడిగ నా బ్రహ్మ!
పార్వతీ దపమున శర్వుండు మెచ్చ
పరిణయ మందునో విరియును శుభము!
మదనుడు సుఖ మొందు మఱి రతిం గూడు
బోయిన దేహంబు బొందును మఱల!
అలరి జితేంద్రియు లంబుధరములు
కోప ప్రసాదాల కూడలి కాద!
నామరూపము లేక నశియింప జేయు
ప్రేమతో గాఢ ప్రియములు గూర్ప
ఉరుములు మెఱుపులు పిడుగులన్ రాల్చ
అమృత జలంబుల నాహ్లాద బరుప!

ఆనాడు జరిగిన యాగాథ నంత
యాకాశవాణి దా నలరి బల్కినది!

ఓ రతీ! కల్యాణి! యోర్పును వహింపు
మదనుడు జీవించు మది శోక మొదలు!
నీ శరీరంబును నిండు ధైర్యమున
గాపాడు కొనుమమ్మ! గలుగు శుభమ్ము!
ఎండకాలము నందు నెండిన నదియు
వానకాలము నందు వరదలై రాద!

శుభవాక్యముల నిట్లు సుదతి నా రతిని
మరణ ప్రయత్నంబు మళ్ళింప జేసె!
అదృశ్య మాయె నా యాకాశవాణి!
ఆ వసంతుం డంత నలతి ధైర్యమున
సురుచిరార్థము లైన సుందరం బైన
స్మరుసతి నోదార్చె సరస వాక్యముల!

పవలంత చంద్రకళ బలు కళల్ మాసి
రాత్రి రాకను నెట్లు రంజిల్లు చుండు!
అటుల నా పతిశీల యా రతీదేవి
కుమిలెడి మనసుతో గ్రుంకు శోకమున!
ఆపద దొలగుట కా శుభోదయము
వీక్షింపగా దా నిరీక్షింప సాగె!

[చతుర్థాశ్వాసము సమాప్తము]



# శ్రీ గిరిజా కళ్యాణము

## పంచమాశ్వాసము

### పార్వతీదేవి తపసునకు బూనుకొనుట

ఆ త్రిలోచను చేత నా మనోభవుడు
దగ్ధమాటను గాంచి తన మనోరథము!
భగ్నమాటను గౌరి భరియింపలేక
నిందించుకొనె! తన యందచందముల!
సహజమే గుణరూప సౌందర్య ఫలము
గోరిన వల్లభు వరియించు టేగ!

అంత నా గిరిపుత్రి చింతలం బాసి
యపురూప సౌందర్య మాత్మ దా గోరి!
తపసుచే బరమేశు దా వరియింప
దపమాచరింపంగ దగ నిశ్చయించె!
కానిచో నారీతి యనురాగ ఖనిని!
యా మహిమాన్వితు నందునా పతిగ?

ఆ గిరిపతి సతి యా మేనకయును!
తన పుత్రి పార్వతి తగ త్రయంబకుని!
తపసుచె వరియింప దగ నిశ్చయింప!
యని విని మేనక యావేశ బడుచు!
కూతు వక్షస్థలిం గూర్మితో జేర్చి
మునివృత్తి మానుమం చనియె నిట్టులను!
"నా కుమారీ! పుత్రి! నా ముద్దు బిడ్డా!
తపమొద్దు! తపమొద్దు! తపమొద్దు! తల్లీ!

పూజింప దలచిన బూజింపు మమ్మ!
ఎందఱో దేవత లింట నున్నారు!
తపసుల కఠినమా తప సెచ్చటమ్మా?
గిల్లిన బాల్గారు తల్లి నీ వెచట?
అతి కోమలంబైన యీ శరీరంబు
భ్రమర పాదంబును భరియింపుగాని!
పక్షిపాదము వెట్ట భరియించు నెట్లు?
తప మొద్దు! తప మొద్దు! తప మొద్దు! తల్లి!"

ఆ గతి మేనక యలరి పుత్రికను
దపసు మాన్పింపంగ దగ బ్రయత్నించె!
స్థిర నిశ్చయం బైన గిరిపుత్రి మనసు
వారింపగా నామె వశము గాదాయె!
నిమ్నాభిముఖమైన నీటిని మఱల
మళ్ళింప శక్యమా? మహి నేరి కైన?

స్థిరచిత్తురాలైన ధీర యీ గిరిజ
తన కోర్కె నెఱిగిన తన తండ్రి కపుడు!
కోరిక ఫలియింప గోనదాక శివుని
తపసు జేయంగను దగ నంత నడవి!
దృఢమైన కోరిక ధీరచిత్తమును!
తన సఖిచే వార్త తండ్రికిం బంపె!

అంత నా హిమవంతు డలరి పుత్రికను
ధీర చిత్తంబును ధైర్యంబు మెచ్చి!
తపసు జేయంగను దగనండ నడవి
ఆజ్ఞతో బాటుగా నాశీర్వదించె!

గౌరి శిఖరం బని గౌరవంబునను
మనచేత నేటను మన్నన నందు!
ఎచట జూచిన నెమిల్లింపుగా నుండు
నాకొండ కేగెను నా శైల తనయ!

అడ్డు పెట్టగరాని యా గౌరి దీక్ష
యాకొండ శిఖరాన యా మహాదేవు!
ఆ భక్త వత్సలు నా పినాకినిని
ప్రార్థింప సాగెను భక్తి తో మతను!
తన మెడ గంధంబు దారాడు చుండు
ముత్యాల హారాలు మోదమా నగలు!
తొలగించి వేసెను బాలార్క ప్రభల
నారచీరలు గట్టె నయముగా నప్పుడు!

తపమున సన్న యా తరుణి శైలజకు
జడలు గట్టెను కురుల్ నరస శోభలను!
భూషితాలంకృతో బొలువుం జెంది
యందాలు విరిసెనో యా మోము నేడు!
జడలు గట్టిన గూడ విడునదు సొగసు!
నాటి సుందరములు నటనాలు నలువు!
సహజమే! తామరల్ సరసుల యందు
దుమ్మెద బారుల సొంపుజే గాదు!
శైవలాంగము సరసతం గూడ
యందాలు జిందును నతి సుందరముగ!

మువ్వెలలను గల్గు ముంజి ప్రాతవుడు
ధరియించె యుమ కటిన్ పరిసెను నగగ!

ఒరిసిన యపుడెల్ల యొడలు బుల్కలను
రోమాంచముల తోడ నొప్పె నా గిరిజ!
ఆ మంజి ద్రాటిచే నట కేటి నొరసి
యరుణారుణ ప్రభ లందె శోభలను!

ఆ లోక కల్యాణి యా శైల తనయ!
తపసున దామున్నె దన్మయము తోడ!
అధరోష్ఠము యందు నా లాక్షరసము
బూయుట మానెను బొలుపుగా నపుడు!
అంగరాగములచే నటు యొల్లు వడెడి
కందుకమును బూన మునుందె మానినది!
లేత దర్భలు కోయు లే సూర్య కాంతి!
అక్షసూత్రమ్ము విడ దంగుళుల యందు!

చిన్నారి చిరుగుల పొన్నారి శయ్య
బవళించు సమయాన బడి జడరాలు!
పూలచే సహితము బూను క్లేశమును
అట్టి యా సుకుమారి యలరు నీ నాడు!
బాహువు దిండుగా బరగ జేసికొని
నేలపైని బరుండు నేల గూర్చుండు!

సవిలాస చేష్టలున్ సవిలోల దృష్టి
తపవృత్తి కా రెండు దగనని దలచి!
మఱలి గైకొనుటకు మాధుర్య మొలుక
నా రెండు వస్తువుల్ నటు దాచె నేమొ!
సన్నని తీగెలం సరస చేష్టలును
హరిణాంగనల యందు నా చపల దృష్టి!

అన్నట్టులున్నది యా శైల తనయ!
తాపసవృత్తిని దగ మున్గిపోయె!

తన తపోవనమందు దన యాశ్రమమున
బోలుపొందు తరులకు బూల తీగెలకు!
స్తన్యపానము వోలె దగ నీరు పోసి!
పుత్రవాత్సల్యముం బోలుపుగా బెంచు!
సంతానవతియైన తరువాత గూడ
తానుగా బెంచిన తరుల తీగెలను!
ముకిపాలు జిందగా ముద్దుగా జూచు!
సుతప్రేమ మఱలదు సుతయు గూడ!

ఆ తపోవనమందు నా శైల పుత్రి
హరిణములను బెంచు నాప్యాయముగను!
నీవార ధాన్యముల్ నింపుగా బెట్టు
అడవి ధాన్యంబుల నందించు ప్రేమ!
వెంటాడు హరిణము లంటు పాదములు
ఒడియందు గూర్చుండు విడని మచ్చికను
గిరిజయు తన కనుల్ హరిణ నేత్రములు
నౌత్సుక్యమున గొల్చి నలరి చెలు లెదుట!

స్నానాది జపములు సరసత నొప్ప
అగ్ని కార్యములందు నలసత లేక!
వల్కలంబులు గట్టి వల్లించు స్తుతులు!
ఇట్టి గౌరిని జూచి సరుదెంచు ఋషులు!
ధర్మ వృద్ధులయందు ధర్మ జ్యేష్ఠను
వయసెన్న రాదన్న వచనము పినమె!

ఆ పార్వతీదేవి యా తపోవనము
పరమ పావనతను బడసి పెంపొందె!
గో-వ్యాఘ్రములు నట గూడి జీవించు
చిలుకలు పిల్లులు స్నేహంబు నుండ!
తరువులు తీగెలు తగ బూ తోడ
అతిథి సత్కృతులచే నాదరించునగ!
నవ పర్ణశాలను నయముగా నచట
యగ్ని కార్యముసేయు నాహ్లాద మొదవె!

తా గోరు ఫలమును దక్కెట్టి తపము
చాలదంచు దలంచె చాల యా గిరిజ!
కుసుమ కోమలమైన కూర్మి దేహంబు
సుకుమారతను విడి సుదతి వే వేగ!
కఠినమౌ తపమును గడగి జేయగను
కృతనిశ్చయంబయ్యె సతి శైలతనయ!
కందుక లీలన్ గష్టంబునందు
అట్టి పార్వతి నేడు నలసట లేక!
మునులకృత్తిని సేవ మోదంబు నంది
కఠినమౌ తపసుల కార్యంబు బూనె!
ఆ గిరిజ నేర్పులు నబ్బురంబు గద!
కాంచన పద్మంబు గాబోలు తనువు!
పద్మస్వభావంబు బాగ మెత్తనయు
గాంచన భావంబు గఠినమై నదియు!

గ్రీష్మంబు గురియు నా గ్రీష్మకాలమున
పంచాగ్ని దపమును బరగ జేసినది!

నలుదిశల్ వెలిగెడి జ్వలితాగ్ని శిఖల
కూర్చుండి నయముగా శిరము పై కెత్తి!
ఐదవ యగ్నిగా నా మందు సూర్యు
తేజమున్ వీక్షించి తేజస్సు నందె!

ఆ లోక కల్యాణి యాశివు గొలువ
నా మహా తపమును సలరి జేయగను!
సూర్యుని కిరణాల సురుచిరం బైన
కనులకాంతులు నొప్పె గలిగి ముఖంబు!
నేత్రాంతముల యందు నెమ్మి నెమ్మదిగ
శ్యామల వర్ణంబు సరసత్వ మొప్పె!
ఆ దేవి శైలజ యట్టి యా తపము
ఘోరమా నియమముల్ గూర్చి పాటించె!
అడుగక లభియించు నా వర్ష జలము
చంద్రకాంతుల దేలు సాంద్ర శేఖలను!
ఆహారముగ గొని యా విధి నుండె
వన వనస్పతి వోలె యొప్పాలు గులికె

తపియింప బడినట్టి తపమె యట్టి
సూర్యకిరణాలచే శుష్కి యున్నట్టి!
తొలకరి వానలం బులకలం గలిగి
భూమాత యావిరుల్ పై లేచు రీతి!
పంచాగ్ని తపమున బరగిన పొగలు
పతితప్తమైనట్టి యా శైల తనయు!
బరగు దేహము నుండి పై లేచె నూష్మ
మా తేజ మంతట నల్లుకో సాగె!

తొలివర్ష బిందువులు దోరంపు భక్తి
తపసుసుందున్న యా తన్వి పార్వతిని!
కనురెప్పలం బడి కెదలి యా చోటు
చెంపల బడి యంత హృదయముం జేరి!
మదియందు గల శివు మహనీయపు భక్తి
నభిషేకమును జేయ నరిగిన ట్లుండె!

ఆ వర్ష ధారల యా గాలు లందు
దపము సేయగఁ బూనె తన్వి యా గిరిజ!
ఆశ్రమంబును విడి యాశ్రయం బొందలి
బండరాళ్ళ వసించు బయలైన చోట్ల!
ఆ పార్వతీ దేవి యా ఘోర దపము
సాక్షులా యున్నట్లు సాంద్రమౌ శిలలు!
మెఱుపు తీగల తోడ మిలమిల మింట
గంటి జూపులతోడ గనుచున్న వనక!

మంచు కాలమునందు మించుగాలులను
చల్లని రాత్రుల జలిగాలు లందు!
నీటిలో నివసించి శిఖికేశు శివుని!
తపము సేయగబూనె తరుణి యా గిరిజ!
అన్యోన్య మెడబాసి యా చక్రవాక
మిథునంబు కల్గుపులు హృదయంబు గదల!
చూచుచున్ రాత్రుల సుడివడి మనసు
కొంతకాలము గడిపె గాంత దపమిట్లు!

పద్మ రేఖల వంటి పెదవులం గలుగు
పద్మ సుగంధియా పార్వతీ దేవి!

ఆ మంచు కాలమున యా నీటి యందు
తపము సేయుచు నుండి తగయిట్టు లుండ !
హిమవృష్టి క్రుంగిన పద్మ సంపదల
తరిగిన శోభలం దభివృద్ధి సేయ !
నీటికిం గూర్పగా నీరజ నేత్రి
తపము సేయుచు నున్నదని యనిపించు !

రాలిన యెట్టాకు రహి జీవనముగ
జేకొని తపమును జేసెడి విధంబు !
తాపస వృత్తిని దక్కొను వారు
ఉన్నతము గదా ! యెన్న కీర్తింతు !
ఆ పార్వతీదేవి యదియును వదలి
తపము జేసెను బహు తరగని భక్తి !
అందులకే యిందరు నాని కోవిదులు
అమె 'అపర్ణ'గా నతులిత భక్తి !

కుసుమ సమానమౌ కోమలం బైన
దేహంబు గలిగిన ధీర యా గిరిజ !
అగ్నిన్ జలస్థల మంతట నిలిచి
తపము చేయగ బూనె దాపస వృత్తి !
కఠిన శరీరులౌ తాపస మునులు
జపముల తపముల సాధించి నట్టి !
ఆ తపో ఫలముల యా దివ్య తేజ
మ్మధిగమించెను నును యతిశయంబుగను !

ఆ పార్వతీ దేవి యటు సేయ తపము !
అంతట నొకనాడు నా తపోవనము !

లేడి చర్మము దాల్చి నిండు తేజమున
మోదుగ కఱ్ఱను ముదమునం దాల్చి !
బ్రహ్మ తేజస్సుం బ్రజ్వరిల్లుచును
ప్రౌఢ వాక్కులతోడ బరిఢవిల్లుచును !
ప్రథమాశ్రమం బిట్లు బరగ మారెవన
యొకజటాధరు డట నొప్పుగా వచ్చె !

అతిథుల భక్తిని యాదరము సేయు
నా పార్వతీదేవి యాజటాధరుని !
బహుమాన పూర్వక బహు సపర్యలను
అతిథిపూజలు జేసి యాదరించినది !
సరిసమానుల నైన సాధుపుంగవులు
నాదరింతురు గదా ! యతి గౌరవమున !

అతిథి పూజలనంది యా జటాధరుడు
నాయాసం బిసలిక నలరి దీర్చికొను !
విధమున నటియించి విమల దృక్కులను
పార్వతిం జూచుచు బరగ నిట్లనెను !

హోమాది క్రియలకు సమిధలుం దర్భ
లొప్పుగా గొనుచు నున్నావా తరుణి ?
స్నానాది విధులకు సరస జలంబు
లభ్యమగుచున్నదా లావణ్య దెలుపు !
శక్తి ని దపమును రక్తి జేయుచును
'శరీర మాద్యం' బను సామెతం దెలిసి
ఆమాట మఱువక ననుసరింపుచును !
నుంటివా? గుణవతి ! యొప్పుగా దెలుపు !

స్వాశముగా నాటిన సరస నీరమున
పెఱిగి వర్ధిల్లిన ప్రియమైన లతలు !
చిగురులు పెంపొంది చెన్నొందెనవియు?
తాపస వృత్తిచే దహించె! నీ పెదవి ?
లేతుంగ బూరుగ లలితారుణిమలు !
బాలల వర్ణంబు బరగిన రీతి !

నీదు కన్నుల బోలు నిండు చంచలత
యనుకరించుచునున్న హరిణ కూనలును!
విశ్వాస దృష్టిచే వెన్నంటి వచ్చి
దర్భ చివురుల నోట గఱచిన యపుడు !
కోపింప బోవుగా కోమలీ! నీవు !
అతి ప్రసన్నము తోడ నాదరింతువుగ !

ఓ పార్వతీ! విను ! మొదర సౌదర్య
మిల పాపకర్మముల నలరి చేయదను !
మాట సత్యము సుమా! మఱి నీవె సాక్షి !
ఓ విశాలాక్షిరో! ఒక మాట వినుము !
సదయ సద్వృత్తిని దాపసులకును
ఆదర్శవతివైయె యెంరీతి విపుడు !

సప్తర్షిగణముచే సంసతం బలుల
వెదజల్లు బూవుల విమలతం గూడ !
అంతరిక్షమునుండి యటు జారి పడెనీ !
గంగాప్రవాహంబు గతిచేత గూడ !
ఆ హిమవంతుండు నా మహీధరుడు
నంతటి పరిశుద్ధ మతడొందలేదు !

నిష్కళంకంబైన నీ చరిత్రలను
వంశ పావనుఁడయ్యె నొప్పుగా నతఁడు !

ధర్మార్థ కామముల్ ధర్మ మొక్కటిని
స్వీకరించితి వీవు స్థిరకాంక్ష తోడ !
నీ విటు గావింప నిరజముఖిరో!
ఇదియె నిక్కమని యింపుగా దోఁచె !
అర్థ కామములకై నటు నిటు బోక
నిలిపితి వీ దృష్టి నిండు ధర్మమున !

సౌందర్య రాశి! యో సన్నత గాత్రి !
నీదు పూజలచేత నెంతయో నేను !
ఆత్మ సంతృప్తినే నందితి నన్ను
అన్యగా భావింప నర్హంబు గాదు !
సత్పురుషుల తోడి సాంగత్య మిలను!
సాప్త పదీనంబు సఖి నీకు దెలియు!

ఓ తపోధనురాల! యో చారుశీల!
ఆ స్నేహ హేతువు నట్టి మక్కువను!
బ్రాహ్మణ చాపల్య భావముం గొంత!
నడుగుచుంటివి దేవి! యంబుజ! వదన!
గోప్యంబు గానిచో గోమలీ! నీవు!
బ్రత్యుత్తరం బిమ్మ! బరగ స్నేహమున!

పరమ పావనుఁడైన బ్రథమ వేధసుని
వంశముం జనియించి వాని కెక్కితివి!
మూఁడు లోకంబుల మోహనత్వంబు
ఒక చోట నుదయించి యున్నట్లు దోఁచు!

ఐశ్వర్య భాగ్యమా యడుగంగ నేల?
వయసు నూతనమును వాసిగా నీకు!
పీని కంటెను వలె వేని సాధింప
దవమాచరించుటో తగ వివరింపు!

బంధులచే గాని భర్తచేత
భరియింపగా రాని బాధల వలన!
వీరకాంతలు నిట్టి ధీర తపంబు
జేసురు జగమందు స్థిర చిత్తములను!
అట్టి విచారముల్ కలజడి లేదు
ఓ కృశోదరి దెల్పు మొప్పుగా నాకు!

అపురూప సౌందర్య మందచందములు
శోక మదెందుకు? సుముఖి! నామాట!
పిత్రు గృహంబుల బొందుగా నీకు
బంధుజనంబుల బాధయు లేదు!
ఇతరులచే నైన యిడుములు లేవు,
పన్నగరత్నముం బాహువున్ సాచి!
ఎవ్వడు గ్రహియింప నిచ్ఛను గోరి?
గాన నీ దవమున గారణం బేమి?

ఈ యౌవనమునందు నింపు సొంపెసగు
నాభరణంబుల నటు త్యజించితివి!
వార్ధక్య శోభిత వల్కలంబులను
ధరియింపబడియెను దరుణి! నీచేత!
చంద్ర తారకముల సాంద్రమా రాత్రి
అల యనూరుని జేత యారాలవడునె?

కావున దెల్పుము! కలికీ! నీమనసు
మాటునా విహరింపు సుధురిమల్ జిందు!

దినమును బొందగా దివ్య తపంబు
జేయుచు నుంటివా; చెలి! యది శ్రమమ్మె!
నీ తండ్రి సౌధములు నిరుపమానములు
స్వర్గ భూముల మించి సౌందర్య గరిమ!
వసుప బొందగ నిల్లు దరుణి; దపంబు!
జేయుచునుంటివో చెలి! యింక చాలు!
రత్నంబు వెదకునా రమ్మంచు జనుల!
రత్నముం వెదకంగ రంజిల్లు జగము!

నీ వేడి నిట్టూర్పు నిశ్వాస జేత
వంకయుం బొక్కుడు సరగున మదిని!
తోచుచు నున్నది తొయ్యలీ! నీవు
గోరిన వరునికై కూర్మి యీ తపము!
చేయుచున్నావంచు జెందె నా మదిని!
ఈ మూడులోకాల నిందు సందునను!
కోరగా దగువాడు కోమలీ! గలడ?
కనిపింప డెందునుం గమలాయతాక్షి!
కోరగా బడియును గోరిక మీర
బొందజాలని వాడు భువియందు గలడె?

ఎంతటి చిత్రంబు! నెట్టి వింతయుకో?
నీవు గోరిన వాడు నిర్దయుండు గః!
కోపియు! కఠినుండ! క్రుద్ధుండ! స్థిరుడు!
చాల కాలమునుండి సరసత్వ ముడిగె!

కర్ణోత్పలములను గరము దొలగించి
వరమొక్కలనుబోలు పసుపు రంగులను!
చెక్కిళ్ళ యందున జిందె వ్రేలాడు
జడలతో నొప్పెడి ఛాందసుం డేమొ!

మునివృత్తి వరియించి మునిగి తాపసిగ
కృశియించు దేహంబు కూర్మి భూషణ!
ధరియించు తావులు సూర్య కాంతులను
కమిలి శ్యామలములై కాంతుల వీడె!
పగటి చంద్రుని వోలె బరితాప మొందు
గనికరం బెవరికి గాదు నిన్జూడ?

సౌందర్య గర్వాన సాహసుం డైన
నీయిష్ట సఖుని నే నిరసింతు సుమ్ము!
వంచితుం డైన నీ వల్లభుం గౌరి!
మందమతి యంచు నే మనసునం దెంతు!
అందమౌ చూపుల నలరు నీ మోము
కనుబొమల్ వర్ణింప కాంత! సాధ్యంబ?
నీకు లభ్యముగాక నిను వరింపకను!
దూరము నున్నట్టి దుర్లభుం డెవరు?

కష్ట మెందుల కిటు గాంత! యో గిరిజ!
కఠినమౌ వ్రతముల గండి పో వదవు!
పూర్వాశ్రమము నందు బూని నే దపము
బ్రోవుచేసిన ఫలము బొందుగా గలదు!
సగభాగ మిచ్చెద సౌభాగ్యగరిమ
నీ కాంక్షితంబును నెఱవేర్చు కొనుము!

ఆ వటుం డెవరోకో! యతనిభా వేమి?
తెలియ గోరెద సఖి! తేటతెల్లముగ

ఆ జటా ధారిచే నావిధిం గౌరి
ప్రశ్నింప బడినదై బహు నాదరమున!
తన మనోరథమును దగ విప్పి జెప్ప!
యత్నించి విఫలమై యారిన సిగ్గు!
తన పార్శ్వవర్తిని దగ దెల్పు మనుచు
గనుసన్న జేసినది తన మది మాట!

ఆ పార్వతీదేవి యాప్రియ సఖియు
బ్రహ్మచారిని జూచి బరిగ నిట్లనియె!
ఓసాధు! చెలికథ! నొప్పగా వినగ
నాసక్తియున్నచో నయముగా వినుము!
ఉష్ణవారణమున నొక్కగా గొడుగు
కమలముం జేసిన కథగ మా సఖియ!
తపసును సాధింప తన శరీరమును
బరికరంబును వోలె బరగ జేసినది!

ఇంద్రాణి మన్నగు చంద్రశేఖరును
మించిపోవంగను మిన్నందు కొనగ!
ఇంద్రాది దివిజుల సాంద్ర దీధితుల
దిక్పాలకుం గూడ ధీరత నోడిరి!
మదను జయించిన మహనీయ మూర్తి
రూపాన వశపడక రూపించువాని!
ఆ పరమేశ్వరు నా సదా శివుని
గోరుచున్నది సఖి! కూరిమి బతిగ!

శివుని హుంకారముం జేసి భస్మంబై
మదనుని బాణముల్ మది గ్రుచ్చు కొనక!
మఱలింప బహుటయు మదనుడు ప్రాగ్గి!
భస్మమైనను కూడ యాస్మరు నలుగు!
బాల! లోల! సుశీల! భవ్య మానసిని!
వేధించుచున్నది హృదయంబు నాటి!

నాటి నుండియు చెలి నలతలం గూడి
తండ్రి గృహంబునం దపియించు చుండె!
తిలకము ధరియించి దీరుగా నుదుట
యలకల ముడుచును గంతలం గలిగి!
మంచుతో కూడిన మధుర సుందరము
శిలపై కూర్చుండి జపించు చుండు!

గానవేళల యందు వీణ మీటుచును
హర చరిత్రము పాడు నాలాపములను!
శివనామ వర్ణముల చెలినోట బల్క
గద్గద స్వరమున గనుల నీరొలుకు!
మాటలం దడబడు మానసం దాల్చు
నదిజూచి యటగల యన్నాంగనలు!
కన్నారి కాంతలు ఖిన్నలై పదిని
బొటబొటం గన్నీరు బొటలించి రపుడు!

అంతియే కాదను! యోరు మానసాయు!
శివనామమును మది జపించుచుండ!
రాత్రి త్రిభాగముల్ రమణి మేల్కొనియు
నాల్గవ ఝామున నాతి నిద్రించి!

ఆ క్షణమె మేల్కాంచి "హా! నీలకంఠ!
ఎచటికేగెద?" నంచు వచనముల్ బల్కు!
కలలోని యా శివు గౌగలింపగను
నిదుర మేల్కాని జూచు బెదురు చూపులను!

సర్వవ్యాపకుడవు! సర్వాత్మ వనుచు
బుధులు చే కీర్తించు బూజనీయుడవు!
నిను మదిం దలచు మనీ దాసనై
నన్నేల గావవు? నాథ! సర్వేశ!
అనుచు దా వ్రాసిన హరుని చిత్రమును
నేకాంతమున బల్కు నీర్ష్య బెల్లుబుకి!

అంతియే గాదు సుమ! సఖి లేశు శివుని
బొందగా యత్నించి పోతి చింతించి!
వేరొక మార్గంబు వెదకి గానకను!
తపసు చేయగ బూనె! దరుణి! నిశ్చింత!
తండ్రి యాజ్ఞను బొంది తగ చెలుల్ గూడి
తపసు చేయగ వచ్చె తరుణి యీ వనము!

నాటిన వనలతల్ నవకోమలములు
చిగురులు పూపులు చిత్ర చిత్రములు!
ఫలములతో నిండె బన్నగా దరులు!
కాని మా సఖి కోర్కె కిధ యట్టులుండె!
పూలు పూయుట లేదు! మొలకయు లేదు!
ఫలముల వెప్పుడు ఫలియింప గలవో!

ప్రార్థిత దుర్లభు బరమేశు హరుని
సుంతయు దయలేదు నెంత వేడినను!

తపసుచే దపియించు తరుణి మా సఖిని
జూపగా మది పొంగు జుమ్మలు జుట్టు!
వర్ష లేమిని గుందు వసుధ నింద్రుండు
వర్షముం దేలించు నా విధంబునను!
శివుఁడు మా సఖి నెప్డు జేకొని కరము
లాలించునో గదా! లలిత పుష్పముగ!

పార్వతి మది గాంచు పడతి యా చెలియ
సఖియు హృద్గత భావ సారమంతయును!
దాపరికము లేక దర్శనీయముగ
యా పర్ణికిని దెల్పె హర్ష లక్షణము!
ప్రకటింపఁబడగ బాలు డిట్లనియె
"ఓ గౌరి! నిజమేన? యొప్పుగా దెలుపు!
నీ చెలి వచనంబు నిందు సత్యములె?
పరిహాస జన్యమో! బరగ విన్పింపు!

అంతట బార్వతి యతి ప్రసన్నముగ
నంజలి ముకుళించి యక్షమాలికన!
ముంజేతి యందున మోదంబు నుంచి
యా యద్రి తనయ యట్లాంగ్ని తోడ!
తన భావమును దెల్పె తగ సిగ్గు నొంది
బరిమితాక్షరముల బరగ నిట్లనియె!

విన్న దంతయు నిజము! విప్రవరేణ్య!
నా చెలి పలుకులు నయముగా నిజము!
ఉన్నత లాభంబు నుచ్ఛమౌ పదవి
నొందగా నే దప మొనరించు చుంటి.

ఆ మహాఫలమును నందగా నిట్టి
స్వల్పమౌ తపదీక్ష యుక్తమే గాద!
మనసు కోరికలకు నంతె గతి గద?
ఎట్టి వాంఛలకును నెగబ్రాకుచుండు!

అంతట నా వర్ణి యలరి యిట్లనియె!
ఆ శివు నెఱుగవు! సతివ! ఓ బాల!
అవమానమును జెంది యతనినే మఱల
గోరుచుంటివి గదా! కోమలీ నీవు!
అట్టి యమంగళు నాచార రహితు
యా భవుం గోరుచు నాసక్తి బలుపు!
నిను ప్రోత్సహింపంగ నే బూనకొనను!
నిను మెచ్చుకొనజాల నీరజనేత్రి!

చెడ్డ వస్తువునకు చేయి జాచితివి
హరుని వరించితి వందాల బాల!
పెండ్లి కంకణముతో బ్రీతి నీ కరము
శివు డట్లు గ్రహియింప స్నేహశీలతను!
వలయాకృతింబైన వన్నెల ద్రాచు
గరమందు నుండు గద! గల్యాణమందు!
ఎటుల సహించెదు బటు భయంకరము!
కుసుమ కోమలముగా గూర్మి నీ మనసు!

ఓ గౌరి! సుకుమారి! యొప్పుగా వినుము.
నీకు నీవే మది నిజము యోజింపు!
కల హంస చిహ్నాంత కన్నె చీరకును
శోణిత బిందుల సాగ గజచర్మ

ములకేళ్ల పొంతన మోహన రాగ
యుద్గాత గాదేమొ! నటియు మొకసారి!

సుందర గృహముల నందాలు చిందు
పూవులు బఱచిన భూమిని! నీవు!
లాక్షారసము లందు లాలింప బడిన
పాదము లుంచెను పార్వతీ నీవు!
అట్టి పాదములను నాస్మశానముల
నెటుల జరించెను? పద్మాక్షి! నీవు!
శత్రువు గూడను జెలివి! యీ పనికి
నంగీకరింపుదు నద్రిజా! వినుము!

ఆ త్రిలోచను నక్షు మందుకో గేవు!
ఇంతికంటె నయుక్త మింకేమి గలదు?
హరిచందనాస్వాద మగు స్తన ద్వయము
చితి భస్మ రజముల స్నేహముం జేయు!

సంస్కార వంతుల సాటి వారలను
మఱియొక నగుబాటు మాటను వినుము!
పరిణీతురాలవై పట్టపేనుగును
నూరేగు దానవు నుత్సాహ గరిమ!
ముసలి యెద్దును నెక్కి పాదమున దరుగ
చిఱునవ్వు జిందరా జేరి యీ జనులు!

ఆ పినాకిని బొందు నట్టి యత్నమున
రెండు నస్తువు లిపుడు మెంతు దుఃఖమును!
బొందెను సుమ! నవి చంద్ర లేఖయును
నీవు ద్వితీయవు నీరజ నేత్రి!

నిఖిల లోకములకు నేత్ర కౌముదివి!
ఆనందనర్తి నఖిల లోకములు!
ఎటుల జేపెట్టను నింపుగా సతిని!
మాను మీ యత్నంబు మా మాట వినుము!

ఆధవు మానంబు సతి కపమానంబు
పుట్టువు తెలియదు బూర్వోత్తరమును!
ధనధాన్యములు లేవి దారిద్ర్యమే ధనము
దినములు తోడనే దెలియంగ వచ్చు!
వరలక్షణములలో వాసిగా నొకటి
యరసి జూడగ లేదు నా శివునందు!
ఎటుల జేపెట్టను నింపుగా సతిని!
మాను మీ యత్నంబు మామాట వినుము!

ఆ యభిప్రాయమును సతివ! వే విడువు!
నా మహాదేవుని యాశ్రయ న్వదలు!
అతివ! నీ వెచ్చట? అట్టివా డెచట?
బంగారు బొమ్మవు! భాగ్యాల గనివి!
సాధుజనంబులు సజ్జన సమితి
కాటిలో గాలిన కట్టె గైరి!
వేదోక్త విధులను వలయు మార్గముల
యూపసత్క్రియలను నొకరి జేయుదురె?

వటువిట్లు ప్రతికూల వచనముల్ బల్క
ఆ పార్వతీ దేవి యతి కోపమందె!
వణకె ని బెదిరెను! వంగిన బొమలు!
యరుణిమల్ దాలికేటి యా కను దుదలు!

కోపంబు సూచించు గోపన బోలె
మాటాడ బూనను మానము దాల్చె!

ఎట్టకేలకు పల్కె యిట్టుల గౌరి!
“ఓ వర్ణి! యా శివు' డోంకారయుతుని!
యాదార్థ తత్త్వంబు నరయంగ లేవు!
అందుకే బలికితి వరమిడి తెలివి!
యతిలోక సామాన్య మచిన్త్య హేతు
లగు మహాత్ముల లోక మరయంగ లేదు!
మందబుద్ధులు వారి మది గాన లేక
దూషించు చుందురు దూరముగుండి!

ఆపదల్ దూరము నంపగా గోరు
నైశ్వర్య సంపదల్ నందగా దలచు!
జనులు ధరింతురు సహజంబు గాను
గంధ మాల్యాది సుగంధ వస్తువుల!
లోకశరణ్యుండు! లోక రక్షకుడు!
కోరికల్ లేనట్టి కూర్మి చిత్తుండు!
ఈ మంగళములచే నేమి లాభంబు!
ఇట్టి వాంఛల చేత నేమి ఫలంబు?

దారిద్ర్యుడైనను ధరణి సంపదలు
ప్రభు వాతడే గదా! ప్రభవ మొందుటకు!
పితృ భూముల నుందు ప్రేమికుండైన
ముజ్జగంబులకును మూలంబు గాద!
అతి భయంకరుడైన యతి సౌమ్యుడంచు
విదులు గీర్తించెడి వేదవేద్యుండు!

అట్టి పరంజ్యోతి నా పినాకిని
నిజరూపమును గను నిర్జరుల్ లేరు!

ఆ విశ్వరూపుడు నా శివ దేవు
డారియుండును నెల్ల వన్ని వస్తువుల!
భూషణంబులు గాని భూరి భుజంగ
గమి జేతనైనను గట్టియుండునుగ!
గజచర్మమైనను గడు వ్యాఘ్రమైన
పట్టుబట్టల చేత జుట్టియుండునుగా!
వృత్రాం ధరియించు బహారుం డలరి
బాలేందుశేఖరుం బరగ ధరించు!
నిర్ధారణము జేసి నిది యని జెప్ప
నెందు భువియందు నేర్వరుల్ గూడ!

ఆ శివు డంటగా నా కాటి బూది
పరమ పవిత్రమై భాసిల్లె జగతి!
అటులనే కద! యింక నా మహోదేవు
స్తోత్రాభినయములన్ నేను దాల్తు!
ఆ ధూళి ధరియించు నా దేవతలును!
తమ కిరీటములందు దమ శిరస్సులను!

ముసలి యెద్దును నెక్కి ముదమునం బోవు
సంపదల్ త్రోసిట్టి స్వేచ్ఛను మాను!
అఖిల సంపదలచే నలరారు నట్టి
ఐరావతము నెక్కి యూరుగు నింద్రుండు!
శివుని పాదములను శిరసుమున్ వంచి
పాదాభివందన బరగ జేయుచుండు!

మౌళిపై నున్నట్టి మందారపూల
రజముచే నరుణిమల్ రంజిల్ల జేయు!

ఆ పరమేశ్వరు నఖిలేశు గూర్చి
దూషణంబులు నెన్నొ దూరితి విప్రుడ!
పుట్టు పూర్వోత్తరాల్ బోరయ రాదంచు
నొక సాధు భాషిత మొకట్టి బల్కితివి!
ఆత్మేశ్వరునకును యాత్రిడే మూల
మనుచు జెప్పగ నాత నరసెన వెటుల?

ఈ వివాదము జాలు! నింక నో వర్ణి!
ఆ శివు గూర్చి నీ వనిన వాక్యములు!
నిక్కమే యాగాక! యొకమాట వినుము!
అతికెను నా మది! యా శివునందు!
శృంగార రసమున సింగార మందె!
భావైక రసమున బ్రబలుచున్నదియు!
స్వేచ్ఛా విహారికి సిగ్గొగ్గు గలదె?
తనత్రోవ దా బోవు వినడేరి మాట!

ఓ చెలీ! నిలువుము! నొవ్వగా వటుని!
మాటాడ వలదని మర్యాద దెలుపు!
మహితాత్ములను గూర్చి మన్నన లేక
అపభాషణము జేసి యలరెడి వారు!
వారికే కాదుసూ! యొకరు బాపంబు
వినువారు సైతము విధిని బొందుదురు!

ఇటుల గాదేని నే నిటనుండి వేగ
వెడలి పోదును చెలి! వినుము! నా మాట!

అనుచు బల్కుచు లేచె నా శైల తనయ
అలరి పై నున్నట్టి యంశుకము జార!
వృషభధ్వజుండను వే నగపుత్రి
చిఱునవ్వుతో నిల్చె జిహ్వాలాసముగ!

నిజరూపమును బొంది నిలిచిన శివుని!
పార్వతి వీక్షించి బరవశం బంది!
గలిగిన స్వేదంబు గంపంబు గదుర
యెటు బోవ జాలక యీశుని యెదుట!
ప్రవహించు వాహిని బన్నుగా నెదుట
కొండడ్డు వచ్చిన గూడిన సుడుల
తొట్రిల్లు చందంబు దూగి యా గిరిజ
యటు బోక యిటు బోక యచటనే యుండె!

అంతట పురహరుం డా సదాశివుడు
అవనత దేహయా యా గిరిపుత్రి!
"నీ మహో దపముచే నీ భక్తి చేత
నీకు నే వశుడను నీరజనేత్రి!"
అని పల్క నీకుండు నా శైల తనయ!
గత క్లేశమును విడి కలకిల విరిసె!
క్లేశము ఫలముచే ఖిన్నత్వ మొంది
నవ నవోన్మేషంబు నర్తించు గాదె!

(పంచమాశ్వాసము సమాప్తము)



# శ్రీ గిరిజా కళ్యాణము

## షష్ఠాశ్వాసము

### [పార్వతీదేవి తపము ఫలించుట]

అంతట నా దేవి యాశైల తనయ!
యా మహాదేవుని యనుగ్రహ మంది!
అట్టి విశ్వాత్మకు నా మహాశివుకు
సఖియచే బలికించె సత్ప్రతిమగ
తన దండ్రి హిమవంతు ధన్యుగా జేసి
దాతగా గ్రహియించి ధర్మయుక్తముగ
స్వీకరింపు మటంచు స్వీయ ప్రార్థనను!
జెలిచేత బలికించె జెంతనే యుండి!

అటు సఖీ ముఖమున యటులు బలికించి!
యా ప్రియు విషయాన నందె నిశ్చింత!
మధు వసంతమునందు మాధుర్య మొలుకు
నాను కోయిలజేత నందాలు జిందు!
మావికొమ్మకు వోలె మధురిమల్ జింద
చెలిచెంత నిలుచుండె జిఱునగవు తోడ!

ఆ స్మర శాసనుం డా త్రిలోచనుడు!
'అటులనే!' యని బల్కె యాశైల తనయ!
కమనీయమన్మోహంబు గాఢానురాగ
మెటులనో యొదులుచు నిశ్చితం బొంద!
జ్యోతి స్వరూపులు ప్రీతిపాత్రులగ!
సప్తర్షి గణమును స్మరియించె శివుడు!

ఆ వారుండ్రటు బిల్వ నా తపోధనులు!
తమ కాంతులను బింగి తమ ప్రకాశముతో!
ఆ వశిష్ఠుని కాంత యా యరుంధతితో
హరుని ముందున కొచ్చి యగుపించిరపుడు!

ఆకాశ గంగకు నటునిబు నాన్న
మందార తరువుల మధుర పుష్పముల!
విరజిమ్ము నలలతో నింపులొప్పారు
రజ్ఞాగములు మన్ని దేజరిల్లుచును!
మదగంధముల జేత మాధుర్య మొలుకు
నా నీరముల మున్గ నా దేవ మునులు
హరుడు భావమునందు నలరి బిల్చుటను
హరుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

ముత్యాల జందెముల్ మెదమున దాల్చి
హేమ వల్కలముల నింపుగా గట్టి!
రత్నాక్ష మాలికల్ రంజిల్ల బట్టి
వామహస్తము నందు వరనొప్ప నుండి
కల్పవృక్షములుగా కల్యాణప్రదులు
హరుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

సప్తర్షి మండల సరినత డిగువ
సూర్య మండలమున సూటిగా రవియు!
తన రథ కేతనాల్ దగులునో యనుచు
గ్రిందికి దింపుచు నంద దీవెనలు!
యుత్సాహ మందును! నట్టి యా ఋషులు
హరుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

ప్రళయంబు నందున బ్నాధి వోలె
నా మహావిష్ణువు నా క్షణమందు!
ఆది వరాహంబు నవతార మెత్తి
భూదేవి రక్షించె బొలుపుగా దష్ట్రి
ఆ సప్త ఋషులను నటులె గోరలను!
గరుణతో రక్షించె గారుణ్యమయుడు!
ఆ చిరంజీవులు నట్టి శాశ్వతులు
హరుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

శేషసృష్టిని జేసి చిరయశ మంది
బ్రహ్మ యంతటి వారు బ్రహ్మ లటంచు
ప్రాచీన విదుఃచే బ్రస్తుతి గనిన
యట్టి తపోధనుల్ నా మహితాత్ము
లా వశిష్ఠుని కాంత యా యరుంధతితో
హరుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

గతజన్మ క్రియలచే గాఢమా దశము
నిర్మించు పరిపాక కర్మలకు ఫలము!
అనుభవించుచు గూడ యట్టి కర్మను
మలల జేయుచు నుండు మహనీయులైన!
అట్టి పుణ్యాత్ములు నట్టి నిస్పృహులు
హరుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

సప్తగుంకు మధ్య సంధ్యగా తోణుకు
నా వశిష్ఠుని భార్య యాపతివ్రతము!
పతిపాదముల దృష్టి బరగ నిల్పుచును!
నా యరుంధతి వచ్చె నలరి వారలతో!

మహనీయ దశముల మూడు రూపముగ
ప్రత్యక్ష దేవిగా బరగుచు నుండె!

ఆ మహాదేవుండు నా పరమ శివుడు
మునులను వీక్షించి మోదంబు నందె!
ఆ మహా మునులను నా యరుంధతిని
సమదృష్టి దోడుత సరసత జూచె!
స్త్రీలు పుర్షు లటంచు చిత్తంబు నందు
భేద భావము తోడ వాదింప బోరు!
సాధు సత్పురుషుల సరసమగు దృష్టి
ఘనతరంబుగ నుండు గమనీయ గతుల!

ఆ యరుంధతి గాంచి యా త్రిలోచనుకు
భార్యయం దాసక్తి బహుతరం బాయె!
ధర్మ కార్యములను తగ నాచరింప
పతివ్రతలగు సతుల్ బహు సహాయినులు!

ఆ పరమేశ్వరుండా జగద్గురుడు!
ధర్మాచరణమున తనమది యందు
పార్వతీ దేవికి ప్రణయ భావమున
స్థానము గల్పింప సంతసం బంది!
మఱల జీవించునని మదనుండు దలచి
యూరట నొందెను నుచ్ఛ్వాసమునను!
పూర్వాపరాధముం బొందిన భీతి
గలిగిన గలతను క్రమముగా విడిచె!

సాంగము వేదముల్ జదివిన యట్టి
యా మహామునులంత నవధులు లేని!

హర్ష మానందమున నాలోకగురుని
బూజించి యిట్టుల బొలుపుగా ననిరి!

ఓహో! మహాదేవ! ఓ పరంజ్యోతి!
నినుజూడ నోచెనె మాయఖిల ధర్మములు!
వేదముల్ నియమాన జపించినయట్టి
అగ్నిహోత్రము విధి నాచరించుటను!
తపియించి జేసిన తపముల గలుగు
ఫలములన్నియు గూడ బ్రాప్తించె మాకు!

జగముల రక్షించు జగదీశ్వరుడవు!
అట్టి నీ చెంతము సేరుచు మదిని!
స్మరియింపబడినాము సఫలుర మయ్యా!
మావంటి ధన్యులు మహియందు గలరె?

ఎవని యాత్మ వసింతు వింపుగా నీవు
అట్టివాడే పూజ్యుడతడె సత్కృతుడు!
వేద కారణుడవు! విజ్ఞాన కేంద్ర
మట్టి నీ మహిమను మది దెలిసివాడు!
పూజ్యుడంచును వేరె జెప్పగా నేల?
పుణ్యాత్ము లని వేరె దెలుపగా నేల?

చంద్ర సూర్యుల కంటె చారు సుందరము
నక్షత్ర స్థానమున నున్నాము స్వామి!
అది సత్య! మది నిజ! మాత్మేశ వినుము!
నీవు బిలుచుటచేత నిజముగా మేము!
చంద్ర సూర్యుల కంటె చరితార్థ మొంది
అత్యున్నత స్థితి నందితిమి దేవ!

నీ గౌరవము చేత నిఖిల లోకేశ!
మా యాత్మలను మేము మర్యాద లొప్ప!
గౌరవంబున జూచి గర్వమది లేక
పొంగుచు నున్నాము భూతేశ వినుము!
ఉత్తముల్ గీర్తింప నొప్పు నాదరణ
తమ గుణముల యందు దగిన విశ్వాస!
సదయమందును గదా యర్హ జీవులకు!
సత్ఫలితము లైతిమి! సౌభాగ్య గరిమ!

ఓ శివ! పరమేశ! ఓ విశ్వరూప!
స్మరియింపగా నీవు జనియించి నట్టి!
ప్రీతి సంతసములు ప్రేమ పుల్కలను
నీకు దెల్పము స్వామి! నిండారు మదిని!
అంతరాత్మవు నీవు! అఖిల జీవులకు!
మా హృదభావముల్ మర్మముల్ దెలియు!
అందుకే దెలుపము! నాత్మేశ! నీకు!
తెలిసిన విషయముల్ దెలుపంగ నేల?

కనులకు నిజముగా గానబడుచున్న!
కాని నిన్నెఱుగము కల్యాణరూప!
బుద్ధి యాలోచన బోధకున్ రావు!
ఆత్మరూపము దెల్ప మాదరంబువను!

నీతత్త్వ రూపంబు నిఖిల మటుంచు
కనబడుచున్న యీ కమనీయ మూర్తి!
సృష్టి సంహార స్థితి చిత్రము లందు
నే చిత్రమో మాకు నింపుగా జూపు!

